శ్రీరస్తు.

సకలసత్కవికుల

సంశ్లాఘ్యమానగోకులపాటికూర్మనాథకవి
చూడామణివిరచితంబును.

శ్రీమదశేషదివిషదాంధ్రభాషాసముల్లసత్కవితా
విశేషభూషాలసద్వేషసంపోషితసంగీతాభిలా
షమనీషిగణసంవర్ణితప్రతోషంబును



స్వపరిశీలనకుశలనివాసీకృతకైలాసంబునునగు
మృత్యుంజయవిలాసంబనునీగేయప్రబం
ధంబుముద్రాక్షరాంకితముఁజేయుట

సకలజనానందకరమనితలంచిబహుపుస్తకంబులుపరిశోధిం
చిలేఖకప్రమాదజనితదోషంబులునివారించిబందరు
పురనివాసుండగు - చింతాసుందరరామధరా
మరాగ్రగణ్యునిచే పా * కుమారయ్యగారికళానిధియను
ముద్రాక్షరశాలయందు

దుందుభినామసంవత్సరజ్యేష్ఠబహుళసప్తమియంద
చ్చువేయించిప్రకటింపఁబడియె.

దీనివెలఅణాలు ౮

# మృత్యుంజయవిలాసశుద్ధపత్రిక.

| పుట | పఙ్క్తి | అపశబ్దము. | సుశబ్దము. |
|---|---|---|---|
| ౨ | ౯ | కేక - - - - | కేకి - - - - |
| ౧౨ | ౯ | తోడ్డుయె - - - | తోడ్డునె - - - - |
| ౧౩ | ౨౧ | కేలులంగీలిం - - - | కేలుకేలంగీలిం - - - |
| ౧౪ | ౫ | కుహూరాత్రి - - | కుహూరాత్రి - - - |
| ... | ౧౨ | నచ్చో - - - - | నబ్భో - - - - |
| ౨౩ | ౧౦ | వేళతోడ - - - | వేళసితోడ - - - |
| ౩౨ | ౯ | రారిబ్రంహచా - - | రాలిబ్రహ్మచా- - - |
| ౩౩ | ౪ | కములతా - - - | కీములతా - - - |
| ౩౮ | ౨౪ | రోసర్వజ్ఞు - - - | రోతమ్మరుసర్వజ్ఞు - - |
| ౪౧ | ౭ | లచ్చ్వెలిసిదోలం - - | లచ్చ్వెవిరిదోలం - - |
| ౪౬ | ౨౦ | బలు - - - - | బలుక - - - - |
| ౫౩ | ౪ | గుబ్రంహేం - - - | గుబ్రహ్మేం - - - |
| ... | ౬ | బ్రంహేంద్రము - - | బ్రహ్మేంద్రము - - - |
| ... | ౯ | బ్రంహేంద్రాము - - | బ్రహ్మేంద్రాము. - - |
| ౫౫ | ౧౪ | యమియ్యాలం - - | యమిత్యాలం - - - |
| ... | ... | తుమవదా - - - | త్వమవదా - - - |
| ౭౦ | ౨౦ | ని యభయం - - - | నినయభయం - - - |
| ౮౦ | ౧౫ | శ్రిసిహ్వ - - - | శ్రీసింహ - - - |

## ప్రకటన.

ఇందువల్ల సకలమైనవారికిం దెలియ జేయడమేమన్నను - మహోన్నత వహించిన గవర్నమెంటువారిచే యేర్పరచబడిన ౧౮౪౭ సంవత్సరం ౨౦. నెంబరు ఆక్టు ప్రకారం యీ గ్రంథమునకు కాపీరైటు అనే స్వాతంత్ర్యము నుపొంది - అచ్చు వేయించినాము - గాన దీనిమరియెవ్వరును అచ్చు వేయగూడదు - అట్లా అచ్చు వేయించినయెడల పైనచెప్పిన ఆక్టులో వుదహరించిన ప్రకారం సదరహి గ్రంథమునుగురించి సంభవించెడి నష్టమును కట్టియువ్వగల వారలు.

౧౮౬౩ సం॥
ఏప్రల్ నెల ౧౩ తేది.

చింతాల - సుందర రామయ్య.

12375928010

[illegible]

శ్రీరస్తు.



# మృత్యుంజయవిలాసము

## ప్రథమాశ్వాసము.

శ్లోకం॥ శ్రీకాంతానందకందాయచిదానందస్వరూపి
ణే। నందితామరబృందాయముకుందాయనమోనమః॥

ద్విపద.

శ్రీరమణీలోలశ్రితజనపాల-కారుణ్యమయశీలకాంచనచేల*శరదం
బురుహనేత్రజలధరగాత్ర-యురుబుధస్తోత్రమృత్యుంజయమిత్ర* త్రిజ
గతీపరిరక్ష శ్రీవత్సవక్ష-సుజనమందారకౌస్తుభమణిహార*కంఖాణపురు
బలఖగకులనాథ-శంఖచక్రగదాసిశార్ఙ్గసనాథ* బలువైనయీబహు
బ్రహ్మాండకోటి-పొలుపొందబొజ్జలోఁబూనినమేటి* శ్రీకృష్ణగోవిందచి
న్మయానంద-లోకేశసద్భక్తలోలముకుంద* నారాయణజనార్దనమురారి
శౌరి-కారణకారణగజరాజవరద* యరవిందములకన్ననలరారునీదు-చర
ణయుగ్మమునకుజాగిలిమ్రొక్కి* వైకుంఠవామనవారిజనాభ-నీకంకిత
ముగనాన్నేర్చినరీతి *మృత్యుంజయవిలాసమృదుతరకావ్య-మత్యంతభక్తి
తోయక్షగానంబు* రచియించినీకునర్పణసేయదలచి- ప్రచురమౌతత్క
థాక్రమమెట్టిదనిన.

దరువు - సౌరాష్ట్రి - త్రిపుట.

శ్రీ వెలయుహిమవంతమనునొక। సిఖరిరాజముసరసభూజము। దేవ
తామయమగుచునుత్తరదిశనుజెలగుఁగా ॥౧॥ సాలతాలతమాలతిలకర।సా
లకురువకకుందవిచికల।మాలతీసుమఫలములందులఁజాలనలరుఁగా ॥౨॥ కస్తు
క్స్తురికల్కితావులగ్రమ్ముజవ్వాజియునుతుహినజ।లమ్ముకప్పురమందునె
ప్పుడునిమ్ముమీరుఁగా.

మఱియునగ్గిరివరం బెటువంటిదనిన.

చూర్ణిక.

శ్రీమదమలకమల రాగభాగప్రభాగతరాగ ధాగధగ్యహీరోపలవార కళాధాళధళ్యకైతవానేక దివాకరనిశాకరకరనికర ధిక్కారితమేరుతాం। సారతరవస్తుచారుతాం। నిజగుహాముఖనిర్గతసింహనాదభీతపాదాగ్రగత దీనదశముఖానేకపాళితయా। బహుళదుర్గాంచితామితనీలకంఠ నివాసత యా।పరిహాసితకైలాసతాం।మహాయాన్నత్యవిలాసతాం।గతస్వానుచర వరానుచరవియచ్చరశరజాతనేత్రాతపత్రితైః।విద్యుద్దండచిత్రితైః। కేక నికరనటనాలోకపరమనోజమహారాజసభావిభాసితాధిత్యకాప్రకాసిత సురవరశరాసనమరీచి గుణగణఘటిత పటుతరపటకుటీరవితాన విలాసథ రైః।రసధరైః।సమేతోధాతురాగవీటీరససుందరకంధరఖ్యాతిబంధురము క్తామణిగణేన। గంగాదితరంగిణీధవళదుకూలజాలేన। కటకతటీప్రకటీకృత మణిఘృణిరమణీయపాదవిలసనేన। ఘనగర్జాసముజ్జృంభితగంభీరవాగ్గుంభనేన। యతులితగతిచతుర పదాతిమంజులకుంజరపత్రరథప్రబలసమ్మర్ద సాంద్రప్రాంతభాగేన। హిమానీరుచిరమాలీనగగనముక్తాతపత్రేణ। య నుపమితమహాధైర్యధౌరంధర్యేణ। భోగగుణగణమహిమాక్రామితాపరి మితధరణీమండలేన। నిజభూభృత్పరివృఢతాం। యతిదృఢతాం। కుర్వన్ను ర్వీతలే హిమవన్నామగిరిరాజో విరాజతే.

క॥ అనియిటులఖిలజనంబులు। గొనియాడగనలరుమంచుకొండకుకుల కామినియగు మేనకదనప్రా। క్తనపూజాకలనవలనగర్భముదాల్చెన్॥

ద్విపద.

మెలతలానందింప మేనకాదేవి - నెలదప్పియొకవింత సీటుతోనుండ*
వెలదికినంతంత వేవిళ్లుబొడమె-బలువైనయరుచి చేబడలికల్మీరె* మహీధర
త్వముగన్నమగనిచందాన-మహిబూనదలచెనామను మ్రింగగోరె* మేను
కృశించెక్రొమ్మిసిమిగన్పించె- కౌను లేమియడంగె కలిమిజెలంగె* మేలిమి

భరిణలమీదిమూతలకు-నీలాలమలిచుట్లునిలిపినయట్లు*సొగసైననీలచూచు
కముల చేత-జిగిగుబ్బ-చన్దోయిచెన్నొందుచుండె*వెలిదమ్మివలెమోము వె
ల్లనైయుండె-బలసెనిట్టూర్పులుబరువయ్యెసొమ్ము*లలసతమిగిలెరేఖావళి
స్థములు-వళులయ్యెనంతటవనితనీక్షించి* యలశైలభర్తమిన్నందిజెలంగె-
నెలలుతొమ్మిదియునునిండినవెనుక*చెలికత్తెలందరుచెలరేగికదసి-పొలతిక
న్యక చెల్లప్రొద్దులుగడచె*చెప్పదుబాలికసిగ్గునమనకు-నొప్పులుగాబోలునె
గిలున్నదనుచు*తలయంటినీరార్చితడియొత్తివేగ - కలిపితెచ్చినయన్నకబ
ళమాయింతి*కసిగాటులుగదినికడలేనియార్తి- వెసతాళజాలక వేదననొం
ద*నాఁడదానికిగండమగునిదికడుపు-వాఁడు శ్రీధరుడుగావలెనని వేడి* కట
[illegible]దనివృద్ధకాంతలవ్వేళ-దిటముగామంత్రౌషధీక్రియల్ జేసి*యిలు
వేల్పులకుమ్రొక్కు-లిడిద్వి~~జకాజ~~- వలయితారుణ్యకధ్వనివినజేయ*ఘనత
రసుముహూర్తకాలంబునందు-గనెకుమారుకుమారికామణినంత.

కాఫిరాగం - ఆదితాళం.

సురలుక్రొవ్విరులవానగురియించిరపుడు(ఉపపల్లవి)పరమానందమునెం
దిరి।ధరణిలోపలినరులూ॥సు॥౧॥ముందుముందుగదేవ।దుందుభులఖిలదిక్కు
లందుగంభీరనాదము।గ్రందుకొనిచెలగగ। దందందందందంధణాంధణాం।
ధణధణాంధణాం।ధణయనిమొఱయగ॥సుర॥ ౨॥ అత్తరిరంభమొదలగు।చి
త్తరిగములుగుబ్బ।గుత్తులమీదగొప్ప।ముత్తెపుసరులుధుముకగ।తత్తైత్రిక్కడు
తక।దిత్తతత్తై।తత్తళంగయని। దాటుచునాడిరి॥సుర॥ 3॥ కరములయం
దువీణో।తక్కరములుబట్టియుచ్చై।స్వరములుగంధర్వని। కరములుకరమరు
దుగ।సరిగమపధనిస।సనిధపమగరిస। గరిమపామపాగమయనిపాడి।సు
రలుక్రొవ్విరులవానగురియించిరపుడు.

ద్విపద.

అంతటహిమవంతుడానందసాగ - రాంతర్నిమగ్నుడైయలరారెకొ
డుకు*నలినాప్తసభుడునైనాకుడన్నెర - జలనిధిలోఁగ్రీడసల్పుచునుండె*క

లికిమాతురురత్నకళికయోచంద్ర - కళయోయనంగచక్కదనంబెసంగ* పార్వత్యమాఖ్యలబ్రణుతికినెక్కి- సర్వలక్షణగుణసరణిజెన్నొంది*య నుదినమభివృద్ధినందుచునుండె- తనివిదీరగతల్లితల్లీలజూచి*వెలదిపక్కనన వ్వివిద్దెముల్ జేసె-జిలిబిలిపలుకులుచెలరేగియాడె* ననిముదమందియిట్లల రారుముద్దు-గనియొయారంబులగనియనెగడి * పసిడిపువ్వులరంగుపరికి ణిమెరయ-పసరుమొగ్గలయాకుపచ్చమేల్ రవిక*ముద్దులుగుల్కగముక్తాఫ లంబు-లద్దినమద్దికాయలుజెలువొంద*యడుగుచిగుళ్లపర్యంతంబుకీలు- జడ తేటిగుంపులసరణిజెలింప* నతివదాగుడుమూతలాడెడువేళ - లతలలో తానెక్కలతవలెదోప*చెలులుగానగలేకచిన్నబోవుదురు- వెలదులుకను మూయువేళమిటారి*కనుదోయిచేరలకన్నహెచ్చౌట - వెనువెంట చువెలదులనెల్ల*తరుణియాగతిదేవతాసిద్ధసాధ్య - గరుడగంధర్వాదికాం తలలోన * నాటలపాటలనమృతరసంపు - మాటలతేటలమహిజేరుగొన్న విద్దెలబుద్ధులవెలలేనిపనుల - ముద్దులయుద్దులమురిపెంపుగతుల * మేటియై సూటియైమించినలీల- నాటికినాటికినవనవలాడు * తనువునకొకవింతతళు కుప్పతిల్ల-వనితకంతంతజవ్వనమంకురించె.

సీ॥పాటకరించినచిన్నిపూపచన్నొలకలుసరులలోపసిడిపూసలనియెన్న। కొలుకులువెడలిచెక్కులనల్లుకొనుచూపుచెదరుకాటుకయనిచేలనెత్తు। కౌ నుపైనలరారునూనూగునూగారునసమకస్తూరిరేఖయనుచుదుడుచు।తరు ణులతోనాటతమికిసాలుననవ్వి చెలిజల్లువిరులనిచేతులొడ్డు । మించుపస మించుమైమిసమిసలుజూచి।పసపునిగ్గులకళయంచుభ్రమవహించు। నవ్య ముగ్ధతయనుపమానముగనమర।వనితతొలుదొల్తబొడముజవ్వనమునందు

సారంగరాగం - ఆదితాళం.

అతివకునెయ్యెనెయ్యెనబాల్యముసడలెనే ।జతురతవిలసిల్లెచాపల్య మెడలెనే॥ ౧ ॥ వడిగట్టితనమున కొడిగట్టెననగ। పడతిచనుమొగ్గలపయ్యె దబూనెనే॥౨॥పవడంపుమోవిలో।యువిదనగవలరెనే। చెవులరతిశాస్త్రం

పుచవుల పెంపెరిగెఁ ॥3॥ కలికిపూవిలుకాని। ములికివలె జెలగెఁ। కుచశైల
లనుతముద్దుగుల్కు-చునుండెఁ.

## ద్విపద.

తలిరుబ్రాయముననత్తటి శైలకన్య-తులలేనియవయవద్యుతులశోభి
ల్లి*భువనజాత ప్రీతిబొందించుకొఁ‌అకు-కువలయమిత్రాక్షి కోమలిపాద*
జలజసన్నిధిజెందుసద్గణంబనగ-నలరెగోళ్లుచిగుళ్లునడుగులబోల* గలవెత
త్పల్లవకాంతిలేకున్న-వలనొప్పమడమలువటఫలరీతి*హాలముఖరేఖాసమధి·
కలావణ్య-జలమగ్నమృదుపదజలరుహ ప్రపద * కమఠయుక్మంజీరకలితకే
రమణీయకలమగర్భములననొప్పె*కాంతజంఘికలింతికంతునివింత-
దంతివంటిదియాటదద్ద తులలరై* కననయ్యెదత్క-రాకారంబుదొడలు-దన
రెదత్కుంభసుందరత చేపిఱుదు * కటిశైలకందరగరిమ జెన్నొందె-గుటిల
కుంతలనాభికుచసురాలయము*నందుండిపొక్కి-లియనుమినుబావి-యందు
క్రీడకువచ్చుయలనాకభామ*ఖచరమార్గంబనకొనురాజిల్లె- కుచసుధాక
లశముల్గూర్చిచాల్గట్టు*నల్లచీమలబారనాదగియారు-పల్లవపాణిమైబరగు
శృంగార*రసతరంగంబులై రంజిల్లెవళులు - మిసిమిగన్పట్టిచన్మిట్టలుప్పొం
గె*గట్టుపట్టికిమేనగల్గినవగుట - గట్టితనంబునగట్టులరేని * పరిహాసించుచు
నుండెబడతిదోర్లతలు- కరపల్లవములచేకాంతిదనర్చె* కందర్పవిజయశం
ఖంబయ్యెగళము-మందయానాస్యసామ్యము జెందగోరు * చందమామకు
మచ్చసడలదెన్నటికి-నింముఖండంబులౌనింతిచెక్కిళ్లు* గాకున్నవాక్సుధా
కణములెట్లొలుకు- శ్రీకారములుకొమ్మ చెవులుగాకున్న*ప్రకటసువర్ణశో
భవహించుటెట్లు- ముకురాస్యరదకుందముకుళముల్బోదవు* చిగురుపోల్కి
మనభాసిలెనోష్ఠయుగళి- నగవొప్పెముత్తైపునత్తుడాలనగ*హరిణీతిలోత్త
మాఖ్యాకృతిమించె- నరుదెకన్నుకుక్-తీరగులేమయగుట*ననవింటిదొరఫా
లనయనుజయింప - తనమేనమామచెంతనుదాచుకొన్న *విలునమ్మలనగ
భవ్యావిలసదపాంగ-ములుబోల్చలేనెలబ్రోచునెన్నొసలు* తనుకేతకీసు

ము దామంబు బెనగి- కొనుసీలభుజగి నాగొమరొందె వేణి* తొలుకరి మెఱుపు నాదొలుతజిగిర్చు-నలరుతీగనతళుక్కు-నుజుక్కు-యనగ* చికిలి జేసినమరు చే సూరియనగ- నెకవింతసొగసుతోసుమ తేజరిల్లె.

వ॥ ఇట్లనన్యకన్యాసామాన్య గణ్యలావణ్యవిలాస భాసితయగున ప్పార్వతిపర్వతరాజ సమీపంబుననున్నయెడ నారదుండరుదెంచె నటయె ట్టువలెను॥

రాగం - పంతువరాళి - అటతాళం.

నారదమునివచ్చెను। గంధర్వకిన్నరులెల్లదను మెచ్చను (అనుపల్లవి) నారదమునివచ్చెనగరాజుచెంతకు। శారదనీరదశారీరరుచిమీర॥ నార॥ ౧॥ నూర్ధ్వపుండ్రమొప్ప। జడలకిసలయరుచిదిశలుగప్ప। యసదృశభక్తి పద్మాక్షమాలికలుతు। లసిదామములుకంఠలగ్నములుగజేసి॥ నార॥ ౨॥ ఉరమునవల్లకిగుల్కా। అదియు। హరినామమెవరుసబల్కా। వరదనారాయణ వాసుదేవాచ్యుత। గరుడాశ్వకృష్ణ శ్రీధరయనిజొక్కుచు॥ నార॥ ౩॥ కలితకక్షపాలభుజమున। కమండులువునిజహస్తాంబుజమున। నలరారువేలుపులాచరించు మెుక్కులుగొంటనట। నమలికుంచెవిసరుకొంట॥ నారదమునివచ్చెనుగంధర్వకిన్నరులెల్లదను మెచ్చను.

ఉ॥ వచ్చినమౌనిగాంచినగవల్లభుడల్లన మ్రొక్కి-పూజపెం। పచ్చుపడంగ జేయముదమందిసతింగనియీశుడీశుడై యిచ్చపలాక్షికర్థనువిచ్చును రామసహస్రనామసం। పచ్చతురాత్మజేయునని పల్కి-మునీంద్రుడదృశ్యుడైచనె.

రాగంకాంభోజి - ఆదితాళం.

అవనీధరాత్మజయునానందమునదనకు। ధవుడీశుడనిపొంగితనబోటికనియె॥ ౧॥ శివుడేమి నే నేమి చెలినన్ను జెందునటె। యవునమ్మ యిదియే మొఱ శ్చర్యమనుచున్. అవని.

తోడిరాగం - ఆదితాళం

జవరాలికంతకంతకువలపగ్గలముగా। శివుమీదచింతనుండెట॥

ద్విపద.

శ్రీసదాశివుడర్ధశీతాంశుధారి-దాసపోషణకారిదక్షకుమారి* నె
డబాసినదిమొదలెచటనుచిత్త - మిడకయాగుణవతిహిమవంతునింట* జని
యించుచెలిగిఁతచ్చెలోపవనికి- ననుపమతపముసేయగనగనేత*తనతనూ
జాతనూతనకళోపేత-గనిరావెయోకొమ్మకనకపుబొమ్మ* నాకూర్మినెల
కూన్ననాతల్లికాన- నీకేళివనిలోననీలకంఠుండు * మునివృత్తినున్నాడుము
ని యోగ-ఘనులకుపనిసేయగన్నెలేకారె*కావుననీవువేగమెమహాదే
వు-వజేయుమటంచుజెప్పినయపుడె * పరమసంతోషసంభరితాత్మయ
గుచు-హరునిచిత్తమువచ్చునట్లుమెలంగి*నామదికోర్కెజెందగగలననుచు-
ప్రేమమీఱంగనారీరత్నమంత.

సీ॥బొమవింటదొడగినపూజిల్క-దొరముల్కి- పోల్కి-కస్తురిసోగబొ
ట్టుదిద్ది। చకచకలీనుతారకలతళ్కు-లువోలెకొలుకులువెడలకజ్జలముదీర్చి।
పొడపుగుబ్బలిమీదబొదవునీరెండనారంగుచందురుకావిరవికదొడిగి। పిరు
దుపొక్కి-లియనుమెరకపల్లముగప్పపాలవెల్లనమించుచేలగట్టి। యంచకొౌద
మలగమిబెదరించులాగు।నండెచప్పళ్లుగళ్లుగళ్లనుచుమొఱయ। నడుముజవ
జవలాడకిల్జెడచలింప।వచ్చెముక్కంటిసేవకుమచ్చకంటి॥

సారంగరాగం - ఆదితాళం.

వచ్చిశంకరునిగాంచెను।నగరాజతనయ। హెచ్చిమోహమునమించె
ను(అనుపల్లవి)వచ్చిశంకరునిగాంచె।నచ్చెరువునకను।విచ్చికల్వపువ్వులు।దె
చ్చివెదజల్లినట్లు॥ వచ్చిశంకరు॥౧॥ పచ్చవిల్తుడటుహెచ్చిశరంబులు। విచ్చ
లవిడియెదగ్రుచ్చినతాళక।ముచ్చటపడితమి।పచ్చిదేరవడి । వెచ్చనూర్చిత
న। సెచ్చెలిచాటున।వచ్చిశంకరునిగాంచెను.

వ॥ఇట్లువచ్చిశంకరునిం గనికరకంకణనిక్వణనంబులు సెలంగ,మ్రొ

క్కి- కుఱంగటమెలంగుచున్నయక్కురంగనయసంగనిభృంగియాశ్చర్యసాగరంబునంబొంగి స్వామీదేవరవారి సామీప్యంబునకు నెక్కుచామీకరగాత్రివచ్చియున్నది యీచిన్నది తపోవిఘ్నంబు సేయంగలదు సెలవేనిసాగనంపించెదననిన పురారియోరీయుపచారంబు సేయుచుండుంగానియుండనిమ్మనిన నయ్యా వెఱచిచెప్పుదునో వెఱవకచెప్పుదునో వెఱపేలజెప్పరా యనిన యీయిందువదన యందముచందము తక్కులుసొక్కులు వన్నెలు చిన్నెలు చూపులుకోపులుజూచియీయమ్మవారిందగులుకొనిమమ్మునక్కర సేయరని భయంబుదోచెనయ్యాయనిననయ్యిందు కళాధరుండుమందస్మితసుందరవదనారవిందుండై యోరీయంతపనియేల బుట్టురాయని యాదరించెనంత.

గీ॥ కలికిలతకూననిగనిగల్ గులుకుచూపు। నల్లగలువవిరులు మేనజల్లునపుడు। నీలకంఠుండునించకనించెఘర్మ। జలవసంతంబుకుంకుమోజ్జ్వలకుచముల.

రాగం - ముఖారి - ఆదితాళం.

వలిగట్టుపట్టి సేవసలిపెనౌర। యెంతో। నెలదాల్పుచెలువుని చెంతనీటు చేర॥ వలిగ॥ ౧॥ అలరుమాటలచేత। నమృతధారచిలికి। పలుచాయమృగ్గులుదీర్చిబాగుమీర॥ వలిగ॥ ౨॥ కలికిజూపులసింగారమూర। నల్ల। గలువతోరణములకలుములూర॥ వలిగ॥ ౩॥ కులుకుచక్కని చెక్కులపేర। నిలుపు। నిలువుటద్దాము నెమటొకళ జెన్నార॥ వలిగ॥ ౪॥ మొలకనవ్వుల తేటముద్దుగారా। తెల్ల। యలరులునించుశివునియడుగులౌర॥ వలిగట్టు॥

వ॥ ఇట్లు సేవసల్పియయ్యంగనభృంగిగనినీవుగంగాతరంగిణీధరునంతరంగంబెఱింగినవాఁడవౌదువు తదంగీకృతంబులగు పనులుదెల్పిన సేయుదుననిన నతండువికవికనవ్వియవ్వాయివ్వామదేవునకు నెవ్వరు సేయుపనులెవ్వి - దోవతులుతికితెచ్చెదనంటివాయీవేల్పు యేనుంగుతోలుదాల్పు- మజ్జనంబునకుసజ్జలంబులు దెచ్చెదనంటివా - యితనిశిరంబున బెద్దనదియున్న

దిపీవనలవిస రెదనంటివాయితని మేనిపాములు మోసవుగానియసదు తెమ్మె రలుసోకనియ్యవు। నీవింక వేగిరంబోగిరంబిడియెదనంటివాయమ్మానీకుజెప్ప కేమిపుణ్యాత్ములైనవారుబత్తిగలచిత్తమ్ముల షడ్రసాన్నంబులిడినవారగిం చి మేమాసపడకుండవిసపుమేతరిపై తిరిగియిచ్చట యున్నట్లయుండు నైననుమిక్కిలిదగ్గిరడాయంబోకకావలయుపువ్వులుమొదలయినవి తెచ్చి యిచ్చుచుండుము నీకునతనియందునాస్థయున్నట్లయున్నది యమ్మనహాత్ము నకునీవుసేయుసేవయంగీకృతంబైనట్లయున్నది దైవగతినిమీరొక్కటిమై ననాపయినిదయయుంచవలెననిన శివపూజార్థంబు పువ్వులచెట్లకుదోహ దంబులుసేసిరటయెటువలెను.

ఆనందభైరవి - ఆదితాళం.

తిరముగతమలపాకుతీగెలెల్లా। తీయ । చెరుకుగడలునాటరేయో చె లియలార। పసరుకిసిమిసిచప్పరములందు। పుష్ప। రసముకలయజల్లరెయో రమణులార। సురపొన్నమొక్కలునాటినచుట్టుపట్ల। మంచి। కురువేళ్లదట్లుగ ట్టరెకొమ్మలార॥ కులుకుసంపెంగచెట్లకొనలయందు। తెల్ల। గురువిందలుం చరెయోకొమ్మలార॥

వ॥ అనినభృంగికంతులువైచుచునిట్లనియె.

అల్లీబిల్లిగనల్లుమల్లెలేలె। తెల్ల। జిల్లేడుచెట్లువేయరెతల్లులార॥ మున్మ రముగగ్రమ్ముజాజిమొక్కలేలె। మంచి। యుమ్మెత్తలువేయరేయోయమ్మ లార॥ మొక్కడలేనిసంపెంగలిక్కడేలే। తుమ్మి। మొక్కలునాటరెయో యక్కలార.

ద్విపద.

తరుణులగూడియుత్తరుణేందునిటల - సరసాంబుయంత్రంబుసరసజెన్నొం దు*బంగరుపనిరంగుబంగలాయింటి - ముంగలబహువిధముంగలసూన*సం తానములనొప్పుసంతానకల్ప - కాంతారమారతికాంతాయుధముల* నె పుడాలుగనుపించునెపుడాదరమున - కపురంబుజిల్లుజొక్కపురంభలందు

నల్లిబిల్లిగద్రాక్షలల్లినచోట-జల్లగాతావులుజల్లగామఱియు* మల్లెపంది ళ్లుచామంతిపుదుళ్లు-మొల్లలుజాజులుమొల్లమైనట్టి*పజ్జలనలరారపాదుల నిండ-గొజ్జంగిపూబోదల్గురియనుప్పొంగు* పన్నీటతెలినీటపదనుననెదుగు పొన్నగున్నలుసురపొన్నలుమఱియు* వకుళరసాలలవంగలుంగాది- సకల పాదపములుసఖులనుబోలె*నొకదానిచేపట్టినొకదానిజూచు- నొకదాని గౌగిటనుంచుసంగీత* మొకదానిదరిబాడుచుండుమోమెత్తు- నొకదాని చెంతనిట్లుచితకృత్యములు* హాయలుమీరగదగనొనరింపనవియు- దయ మచ్చటాడినదన్ననగాని*తుదిమీదనుమిసినతొయ్యలులార- యదిమాకు మన్ననయనినవ్వుమాడ్కి*బువ్వులుబూసినపువ్వారుబోణి- పువ్వుబోణు లతోడఁబువ్వులుగోసె.

రాగం కన్నడగౌళ - అటతాళం.

ననలుగోయువేళ చెలినినవ్వీరింతులు॥ అనుప॥ మనసుచెంతచంద్ర వఖాళి।పైనుంచిమెల్లనె॥ననలు॥౧॥ కొనగోటితళ్కు లుజూచి.ననలనికొయ్యా బోయిన। ననబోణిగోటితళ్కు లని। ననలుమానిన॥ననలు॥ ౨॥ తనచూపు గుంపులతేఁటిదాటులనితోలబోయిన।ఘనదృష్టిజాలమనిభృంగి। గణములు మూగినదోలక॥ననలుగోయువేళచెలినినవ్వీరింతులు.

క॥జవ్వనిమరుడికప్రియుపై। జివ్వకువచ్చిననియతని చిలుకలకాణల్ నివ్వటిలద్రుంచుపోలిక।పువ్వులువడిగోసిపువ్వుబోఁడులకనియెన్॥

చ॥చిగురుజడల్ జెలంగిదరి।జెందినద్రొవ్విరిచాలుపేరజె। న్నగునెల కూనలింపుమొల।యందగుపుష్పాడిభూతితోలతో।రగవరభూషలొప్పమక రందవియన్నదిదాల్చిశర్వునో । యగమువహించుకల్పకన । గావళిపజ్జల భృంగులాడెడిఁ॥

ద్విపద.

అనుపమవేషమై యయ్యామాయోష- దినదినమొకవింత తేటతోవచ్చి మగరాలపొఁజుకమ్మలధగధగలు - సిగమినువాకపైచిందులుద్రొక్క* శే

షభూషణుప్రదక్షిణముగావించి- యీషన్నతాంగియైయెడగుబ్బలూరయ
ప్రచురమేచకరుచిప్రచయయుక్చలిత- కచచకచకలీలగళముచుంబించ*
మ్రొక్కనెన్నోసలుసొంపులుచూచివాడి - ముక్కంటితలపువ్వుమునుచి
న్నబోవ*చెంగటపరమేశుచేజింకబెదరి- పొంగారునోరజూపులుజూచుచు
న్న*పురహరుండంతతపోయోగ్యమైన - యరజూపునోయ్యారినరసినిశ్చే
ష్ట*తనుయోగనిష్ఠనెంతయుబెంపుసేయ- తనువిభూతివివర్ణతనుగప్పివైవ
ఘనమానముద్రగద్గదికనుమాట - వనితపైకూర్మియవ్వారిగానుండ*హే
త్వంతరములుండుటెఱిగియీశ్వరుడు-సాత్వికభావంబుసడలంగజేసె.

ఉ॥ఆసమయంబునందుసక।లామరులింద్రునిగూడితారకా। ఖ్యాసు
ర　రెల్లజల।జాసనుసన్నిధిదెల్పబ్రహ్మయా। ర్యాసమనేత్రులంగలపు
డంతచమూపతిగల్గిదైత్యువీ। తాసునిజేయునన్నదివి। జాగ్రణిమన్మథునిం
దలంచినన్॥

ద్విపద.

అంతటకాముండుహరిహయనగర - గంతుకాముండుచొక్కపుజిగురాకు*
పసిమిగుల్కెడుకుసుంబాపాగజుట్టి - వేసబంగరపురంగువిరులంగిదొడిగి*ప
సిడిగేదగిబాకుబగలునజెక్కి-హాసగజెంగల్వకెంపుతురాధరించి*చిలుకతే
జీలబూన్చినకమ్మగాలి - బలుతేరుపైనెక్కి-బతిమాలుచున్న* రతిదేవిగనిన
వ్విరమ్మనిబాహు-లతికలుబట్టిమెల్లనపైకిదిగిచి*వామాంకముననిల్పివట్రు
వగుబ్బ -పైమేలుమోహనాంబకముగీటుచును* చెరుకువిల్లెక్కిడిచేనిండ
బూని- త్వరసురవరపురిదరియంగనరిగి* తెఱవయందిచ్చెడితెలనాకుచుట్ట
కొఱికియొసంగుచుకొమ్మకిట్లనియె*నలినాక్షియిదివియన్నదిజూడుహేమ
జలజహస్తములరజంబంటనెగరు * గండుతుమ్మెదలబంగరుబంతులాడు-
చుండనుత్పలగంధియొయ్యననాచు*పెన్నెఱుల్ జెదరంగబేడిసజూపు-చి
న్నెఱుగుల్కంగజెన్నలరారు*నాతిగన్గొనుమిదెనందనారామ-మీతోఁటసో
యగంమెందునలేదు*చరియింతురిచ్చనిచ్చటపూవుబోడల-గరుడగుహ్యక

యక్షగంధర్వసిద్ధ* సురముఖ్యదంపతుల్ జూడులతాంగి- తరుణీయల్ల దేక ల్పతరువాటిజూడు*చలివేళ వెట్ట వేసవిచల్వ జేయు- పలు దెరంగులపుష్పఫ లములనిచ్చు*పనియెంత కామితఫలములొసంగు-నని ననభోణికటాక్షబంభ రికి* కానుక యొసగెడుకై వడి నెక్కు -సూనమంజరి చెలిసొగసుగానుంచి* మదనుడయ్యుపవనమార్గంబుగడచి-మదగజగమనతో మఱియునిట్లనియె.

బిళాహరి - అటతాళం.

ఇదియైరావత మెయ్యో కొమ్మా।పట్టపు। టేనుగెవజ్రికిముద్దుగుమ్మా॥ఇది॥ కుమురునిండిననీదుగుబ్బచన్నులతోడు । యెదురించుకుంభములీకుంభికలరె డు॥ఇదియై.

రాగంసారంగం - ఆదితాళం.

ఉచ్చైశ్శ్రవమిదిబాలాకల।శోపధిబుట్టినలీలా॥ మెచ్చులుగొను నే వేళ శుభ।మిచ్చు చిహ్నములుచాల।యచ్చపుబంగరు।కుచ్చులపల్లము।దెచ్చియిడి నయిదె।వచ్చె వినతకొడు।కిచ్చటికనిమది।ముచ్చటలెసగవి।యచ్చరజాలము లచ్చెరువడుదురు॥ఉచ్చైశ్శ్రవమిదిబాలా.

వ॥ఇట్లుపచ్చవిల్కాడు నెచ్చెలితో ముచ్చటలాడుచునరిగియరిగితిరిగి చూచి యహహాపంకజమిత్రుండు గుంకుమెట్టమీద నీమచక్కోయి సొంపునింపు కెంపుపతకంబునుంబోలియున్న వాడనిసరససంగీతభంగీతరంగీకృతాం తరంగకురంగనయనాకృతమృదంగధిత్తధిమిధిమిన్నాద వేణువీణానిక్వాణ సంపూరితనానాగోపురంబగునాగోపురంబుబ్రవేశించిపటుతరసంధ్యారు ణరుచిలంపటజటాపటలకాషాయపటలలితసాయమనుష్ఠానార్ధవియత్తటినీ యాతుకామామరమస్కరులకునొసరిల్లినమస్కరింపుచు । రోహిణీరమ ణోపలఖచితవిపణిధరణీతలప్రతిఫలితతారాగణద్విగుణితాగణితమణిఘృ ణులకరుదందుచునభిసారికానయనకనీనికాకజ్జలనిచయ కాలాగురుకలితం బగుకటికచీకటి ప్రాపునయథేచ్ఛందిఋగు జారచోరజనపరంపరలుబఋవె త్తమూలమూలలకునొదుగచంద్రుండైరావతంబు పోలికెకలంకమదరేఖ

తోనభ్రముసమీపంబునకరప్రసారంబు సేయుచు నంతకంతకునుదయరా
గరాంకవంబుదిగంద్రోచి వెలుంగందిలకింపుచు వలసివచ్చిన మేనమామ
కూతురువావిగాదన్నకరణి తెలివరులగరువంబు నుఱుము సేయుకొఱకున
చ్చర మెఱుంగుబోఁడులచిఱునగవుల మెఱుంగులుండనిదియేలని క్రొన్నెలం
బోడము వెన్నెలందిరస్కరించి నప్రోడల మేడలవాడలనీడల జాడలవచ్చి
వచ్చి యొక్కొక్కదరులబిత్తరుల మొత్తములు సరసచిత్తములరసికసత్త
ములతో నెత్తంబులాడుచు కవరలంకించి వేయు నెడ కెంపుటుంగరంబుల
మెఱుంగులతోఁ గలసిహస్తపల్లవంబులధగద్ధగితంబులుగా నెగసిపడుఛవి
నల్లగలువల తెగలగవయుమగ తేటిగములపగిదినిగనిగలు నెగడు సొగసుచూ
ాగటాలపాళిపై జెదర నిబ్బరంపుటబ్బరంపుసిబ్బెపుగబ్బిగుబ్బల యు
బ్బునంబిగిలిననీలిరవికెలలోనిట్టు దేరుతదీయచ్ఛాయలు గీటురాయిమీద నే
టుగనుకుందనంపు రేకల యందంబునం జెందమదనోన్మాదంబునం దమత
మిబయలుపడబ్రియులుతమపిఱుందనిలిచిచూచు చిరుతకన్నియలంగని యి
దెయీవగలాఁడి బంగరుసారెలుపయ్యెదలోదాచుకున్నదని మొలకచన్ను
లుచిదిమిన నదరిపడికరకంకణకటకకాంచికాఘుణంఘుణలు నివ్వటిల్లనవ్వ
లికిథుముకంబోవు నవ్వోలందులంబెనంగిపట్టుకొని నవ్వుచుటెక్కెంబుల
కుచకక్కనిక డానిబేడిసలంబట్టుమదనమూర్తులంబోలు వారిందప్పకవీక్షిం
చినాచిన్నియొప్పులకుప్పలయప్పలప్పుడాటలుజాలించి బాలపావలనీలిగే
లిసేయుచు రేయనిమీపనికేమిమాపగదిర్చుకొనియెదమను నభిప్రాయంబు
తేటపడఁదాటించి కేలులంగిలించి కూడి మేడలోపలికరిగి యనల్పంబుల
గుహంసతూలికాతల్పంబులవసియించి హాయలుమిగిలిన పికిలిపిట్టల
బోట్లాడించుకొలకు నామిషంబుగలపించుకరణి విడియంపుమడుపులంది
చ్చునూడిగంపుచేడియలవీడుకొల్పి ముడిసడలించు నెడనెడలేక నడరించు
జిగిబిగికౌఁగిలింతలవింతలనింతింతలైపోవురవికల యవస్థంగనిబెగడిన చం
దానతనకుదాననీవివదలినంగదసి యధరపల్లవంబంగుళంబులనొక్కి మెద
పియామూలచుంబితంబు జేసి తత్ప్రసమాధుర్యంబునకుసొలసి గిలిగింత

లుగొలిపి చెలులతలిమంబులనునిచి మునుపులని మొనలగడి దేరినమహావీరులగుట నప్పురుషులు తదీయకుటిలభ్రూధనుఃప్రసారితంబులగు చుఱుకుచూపులవాడి కోలలకుడీలుపడక నిశ్శంక జేయుహుంకారంబులకు జంకి కొంకక నఖాయుధంబుల నలుకులకువెఱవక నుచ్చైస్తనఘట్టనంబులకుతగ్గక రొమ్మిచ్చివిచ్చలవిడిమదన కదనంబునంజెనంగి జలజరాగతాటకాంకితవనితాననంబులుచూచి మునుపుతమరుభేదించుకొనివచ్చునప్పుడు సవివరంబగు రవిబింబంబును తారావరబింబంబును తలంపులకువచ్చినకఱంగకుండునంతరంగంబులతో తెరపివెన్నెలబయళ్ల గలయగమకించి మీదియంతరువులకుసంతసజేసినశశికాంత సౌపానవితానమార్గంబున సెక్కు నక్కాంతులవదలక యాలతకూనలత్యంతప్రియరత్యంతరాయంబుఁ కుండ కరపాదపల్లవంబులకంఠకటులు గౌఁగిలించుకొని కల్పతరుకాండంబున కెగబాకితదాసవపానంబు సేయునలవాటున ప్రియాధరమధురమధురసంబులు గుటుకుగుటుక్కునంగ్రోలి యపరిమితంబులగునుపరతంబులవిరిపఱుపులంబేర్చునా నేర్పరులంబయికొని కరకంకణకాంచికలుబిగియించి యవికలగతులగులకుముకులపోలికకొంతదడవుసురత తాండవంబునెఱపి యెడనెడతమతమనడుములు కేలందొడరిపట్టునాదిట్టవిటులందిట్టి చెక్కిలంగొట్టి చెమ్మటందొట్టి యెట్టకేలకునిట్టటనరానిసౌఖ్యానుభావంబుల భావంబులుగఱంగి కీల్వదలినబంగారుబొమ్మలతెఱంగుననురంబుల వ్రాలిసోలితోడనెకఱంగు నారసికపుంగవులంగౌఁగిలించుకొనియఖండానందపారవశ్యంబునొంది మందాకినీసుందర కనకారవిందమకరంద బిందుసందోహబృందమిళన్నందన మందపవనంబున సేదదేరి మఱలనిజప్రియులు మెల్లనెకరంబులుసాచికుచాగ్రంబులపైవైచి ముత్తరులదరులకురానిచ్చి మిక్కిలిసొగసుపొక్కిలినిమిరి నితంబవిస్తారంబుగాంచునెడహుంకారపూర్వకంబుగావిదళించునమ్మించుబోఁడులకరకంకణనిక్వణనంబులు వినియిదియేమి మదీయకోదండరవంబును బోలియున్నదని నివ్వెరపడుచు మఱియుకొ క్రొక్కారుసౌధరాజుల ముగ్ధసోమయాజులు తమ్ముగవయదివురు దివిజవనిత

లంగని మేమన్య స్త్రీసంగమంబెన్న డెఱుంగనివారము మమ్మునంటకుండ
నిన మేముస్వస్త్రీలమే కాని యన్యస్త్రీలము కాము మీరు సేయుతపోవిశే
షంబులవలన యిట్టిరూపవిశేషంబుతో మిమ్మునబొందవలసెనని వారు
తత్కాచనిచయావలోకనంబున కుహూరాత్రియనియును తదాననద
ర్శనంబునరాకానిశియనియును సంశయించిన నచ్చాతుర్యవతులు నమస్కా
రవ్యాజమ్మునఫాల చతుర్థిచంద్రదర్శనంబుజేయించి యంతఃకలంకంబు
లుబాపికుసుమచాపుకేళిం దేల్చుచు మణిత వ్యాపారంబులుగావించిన న
వ్వణతులతోనిప్పుడు సంభాషణయోగ్యకాలంబుగాదని మానంబున హ
స్తసంజ్ఞలుసేయ నయ్యింతులుదంతక్షతన ఖక్షతంబులుగావించిన నవ్వి
లలిగి నిష్కారణంబుమమ్ముం గఱచిగిల్లుమరేయని యాద్ధత్యంబున
లేచిశుద్ధాచమనంబులుజేసియావలికిజరుగు నమ్మహాత్ములబతిమాలునచ్చో
టుల యమృతంపుతేటలగు మాటలువిని యిదియేమి మదీయదివ్యరథశుక
భాషణంబులవలెనున్నదని వెఱగుపడుచు మఱియు నెక్కడెక్కడ పెక్కు
దిక్కులలెక్కలకు మిక్కిలియగుచక్కెరబోణుల చక్కదనంబులుజూచు
చు పురందరమందిరద్వారంబుముందరనిలిచి తనరాకపాకారి కెఱుంగిం
చిననతండుశచీయుతుండై మిత్రామాత్యసహితుండై రంభాదినటీనాట్య
దిదృక్షాపరతనుండియు కార్యాపేక్ష దక్షాంతరంగుండు గావునతనకున
భ్యంతరంబేమి యేలవింతరమ్మనుమని తగువారింబనిచిన కంతుండుసంత
సంబెసంగ మొగసాలగడచి యతిలాలితనూత్నరత్నకలితవిశాలచంద్ర
శాలాదినిలయ జాలంబవలోకింపుచు ననేకకక్ష్యాంతరంబులు నిర్వర్తిం
చి ప్రకటిత విశ్వకర్మమర్మకర్మ నిర్మాణవిచిత్రమణి చిత్రగవాక్షద్వార
కవాటాదిబంధురంబును పారిజాతవనీజాత సుమజాతపరిమళోపేతం
బును భోగవతీభ్రమదశశికాంతబద్ధాంబుయంత్రనిర్గత మందాకినీధారా
విరాజితంబును దివ్యతేజోవంతంబగు వైజయంతంబనుమణిమయసింహా
సనంబుననుఖాసీనుండగు సునాసీరుంగాంచి నమస్కరించి శచీసన్నిధా
నంబున రతీదేవినుండనియమించి పంచశరుండు నిజాజ్ఞ నర్ధాసనంబున

గూర్చున్ననిం(ద్రుం)డ మందానందసాం(ద్రుం)డై యరవిందసౌందర్య సద
నమదనవదనంబవలోకించి కించిద్దరహాసంబునకుశలప్రశ్నంబుజేసి విలా
సవాసంబగునాగవాసంబులకటాక్ష నిరీక్షణంబు సేయుచుండెనంత.

సీ॥సుందరయువవ్రజ్ఞ్మేళిందమాలికలీలసొగసైనజడమేనజుట్టికొనగ। మదనకోదండసంభవగుణధ్వనిరీతి నందెలనినదంబుగ్రందుకొనగ। గురుశంఖశంకగైకొనిహారము ప్రదక్షిణములొనర్చ గతికంఠమునదిరుగ। దరి నున్న తెలిముత్తైసరులుజాఱినగతినొసటి పై శ్వేదబిందువులుదనర। కంతుడాడించువింతపూబంతియనగ। పొలుపుగలజాళువాకీలుబొమ్మయనగ। లలితమారుతచలజాతిలతయనంగ। నాట్యమొనరించెనటరంభనవరసముల॥

క॥ఊర్వసినటియించెనుగుచ। పర్వతములహారఝరులుపట
గయఁ। సర్వసుపర్వులధృతిమరు। దోర్విలసనమహిమచేతఁ నోడ్తొనెగ
యఁ॥

చ॥నకనకలాడుకౌన్వణకనవ్వుమొగంబునహస్తకంకణ। ప్రకటఝు
ణంఝుణల్ జెలగ।బంగరుటందెలుఘల్లుఘల్లనం। తకుఝుకుతక్కు-ధిక్కు-తక
ధక్కు-టధిక్కు-టతక్కు-ఝుంకిణాం। తకధికయంచు మేనకయథావిధినాట్యము
సల్పెవింతగఁ॥

గీ॥మఱియుహరిణిశిలోత్తమమంజుఘోష। యాదిగాగలచెలులనా
ట్యములుజూచి। నవ్యగంధర్వగీతికానంద మొంది। యందఱినివీడుకొల్పియిట్ల
నియెవజ్రి॥

రాగంమారువ - అటతాళం.

ఇన్నాళ్లకుమిముగంటిమి। మదన। యీప్రొద్దుసుఖలీలనుంటిమి (అనుపల్లవి)
నన్నుసుతతుల్యునిగాజూడక। యిట్ల। నందగునసురనాయక॥ఇన్నా॥౧॥ నీకు
గాక మాకార్యాము సేయ నెవ్వరికిగల్గునీశౌర్యము। నీకారుణ్యముగలిగిన
యింద్రా। నాకేమియబలరుద్రుడలిగిన॥ ఇన్నాళ్లకునినుగంటిమి। మదన। యీ
ప్రొద్దుసుఖలీలనుంటిమి.

క్రమ్మరనమ్మహేంద్రుండిట్లనియె.

ద్విపద

వినుము మన్మథజగద్విజయప్రతాప-నినుబిలిచినపని నేవివరింతు*తార కదైత్యుఁడందఱనల్లయింప- నారాక్షసుని ద్రుంపనలవిగాకున్న * శివకుమారుండైన సేనాని గౌరి-శివునకుతనయుండుసిద్ధించుకొంటకు* నుమతోడనద్దేవునెనగూర్పుకృత్య - మమరింపమరుడు గాకన్యులిక్కార్య * నిర్వాహకులెయనినిన్నుఁగోరితిమి - పార్వతీపరమేశపరిణయఫలము * దుష్టశిక్షయుసుధాంధోవిప్రముఖ్య - శిష్టసంరక్షయు జేకొనువేళ* యిదిగదాయని వేడనించువిల్కాఁడు - మదమున నుప్పొంగి మఘవునకనియె* నలవసంతుని సహాయ సినీదు-సెలవుచొప్పనశివా శ్రీసదాశివుల* నొక్కటిగా జేతునొక్కబాణమున - గ్రక్కననముచుగంకణమొగనెత్తి * మీసంబువడివేసిమీవానితాత్రిణ-జూచుకొమ్మని లేచిజోహారుచేసి *శతమన్యునిర్దిష్టచతురసౌధమున-రతిదేవితోడనారాత్రివసించె.

ఉ॥అంతటనుగ్రుపైజనుట।కారతిబెగ్గిలిచిన్నబోయిశ।యత్యాంతము నంచుదైన్యముబ।యల్పడఁజెక్కిటచెయ్యిజేర్చిచ।న్బొంతులునొక్కగాదివు రు।ప్రాణవిభుంగనితాళుమంచున।త్యంతవిషాదమైపలికె। నంగనకన్నవనీరు గ్రమ్మఁగ౯.

ద్విపద.

ఓనోయిమన్మథయహహనీబుద్ధి- కేనేమియనుదాననీశ్వరుతోటి* వలువనిపగసేయవచ్చునామనకు-బలభేదికేమిజెప్పగవచ్చుసేన*హరునితపోవిఘ్నమాయెనామేలు - దొరకొనెనంచుసంతోషించుగాని * మనకొక్కకీడైనమటితాను గాని-యనువుననుండుకార్యాతురుండింద్రుఁ*డదిగాకసామాన్యుఁడానీకుశివుఁడు -మదినెంచగాంచనాంబరునంతవాఁడు* వినుచెట్టుగొట్టిపైవేసుకోరాదు-తనసత్వమెనురుసత్వముగనవలయు* నిదిదుర్ఘటంబుమీరిక్కార్యసరణి-వదలుకొన్నదిమేలువల్లభనాదు*మనవిచేకొను

మనిమదవతి మ్రొక్క--ననవింటిదంటయానన బోఁడికనియె*భామినియీవ ట్టిభ్రమ లేలనీకు-కాముడు దేవతా కార్యంబుమాన*డే మైన గానిమ్ము యిభ రాజయాన- నామాట కెదురాడనాయ మేయనిన*కానున్న పనియెందుగా కపోదనుచు* బ్రాణేశు కౌఁగిటఁబవళించె వేడ్క-.

వ॥అంతవింతమంతనంబునకంతుండు.

సీ॥వలువంతదొలగించవలదనువనిత కేల్వీడిపించిబొ_త్తిగాసడలఁజేసి పలు నెక్కు_లనుజిక్కు-పఱపకుమని మ్రొక్కు-కుసుమకోమలిగజాగుజియొన ర్చి। తార్మారుగా నోపతాళ రాయని వేడుపడఁతి కేల్గవబట్టి పైకిదిగిచి।నీపట్టు వదలవన్నిటగొంటువనితిట్టునువిదబల్ గిలిగింతనుబుకఁజేసి। చెదరుకురు లెగ దువ్వి చేచెమటవిసరి। మడుపులందిచ్చిహారముల్ మరలవైచి। హెచ్చ దెల్పితమిగొల్పిపచ్చవిల్తుడతివతోరతి దేలి సౌఖ్యముననుండె॥

మాలినీ.

వననిధితనుజాతా వారిజాక్షీసమేతా। దినకరశత తేజాదీనమందారభూజా। ఘనఘననిభగాత్రా కంజమిత్రేందు నేత్రా। వినుతసురవరేణ్యావిప్రగోభూశరణ్యా.

మోదిసీవృ_త్తము.

జగదధీశ్వరాసన్నతేశ్వరా।నిగమభాసురానిర్జితాసురా। సుగుణరాజితా సూరిపూజితా।విగతదుష్కృతా వేదసత్కృతా.

గద్య.

ఇది శ్రీమన్నారాయణ చరణదాస్య పవిత్ర గోకులపాటిబుచ్చ
నామాత్యపుత్ర శ్రీమ_త్తిరుమల పెద్దింటి సంపత్కు-మార
వేంకటాచార్య దేశికానుగ్రహ సనాథ శ్రీకూర్మ
నాథప్రణీతంబైన మృత్యుంజయవిలాసం
బను శృంగార నాటక గేయ ప్రబంధం
బునందు ప్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# మృత్యుంజయవిలాసము

## ద్వితీయాశ్వాసము.

క॥ లక్ష్మీక్షోణీనీలా। పత్న్యుల దృగ్రమణలోకపాలనచణమే। రుక్మభృత్పతిధృతిశశ। లక్ష్మబ్రధ్నాక్షు భవ్యలక్షణనిలయా॥

అవధరింపుము.

సీ॥ పయనమే గెడు రతిపతి కొంటి బ్రాహ్మణుం డెదురయ్యె నన శుక్రుఁడు సయ్యె। దీనతతో రతిదేవి నెమ్మొగమట్లు చంద్రబింబము తొంటిచాయదప్పె। వలదిశ పగనీకు జలజాస్త్రయని దెల్పు రీవి బహుద్విజారావమెసఁగె। హరకాములకు యుద్ధమగునంచు మెల్లన జరిగెనా నక్షత్రజాతి యుడగె। సుమశరుని మూఁడుకన్నులఁ జూడఁదలఁచి। శివుఁడు మున్నగ జంద్రాక్షిచేత జూచి మించి రెండవకంట నీక్షించెననగ। నరుణమండలము దయాద్రి నలరెనంత.

రాగం సురట - త్రిపుట.

మదనుఁడు హరుని యాశ్రమమునకు జనియెన్ ( అనుపల్లవి ) మదవతితోఁ గూడి త్రిదశేంద్రుని వీడ్కొని॥ మదనుడు॥ కోదమ రాచిలుక తురికీ। సుజ్జము ధుముకగ మొగలి। పదనుకత్తి గ్రుళ్ళిపింపుచు పంతములాడి కేరుచు॥ మదను॥ ౧.

క॥ అంతకచకాంతికలితల। తాంతకనర్ష్మంగరవమహాగహనలతా। చింతితవధూకపథికదు। రంతమగు వసంతమలరె నతికాంతంబై॥

ద్విపద.

అలరారు నవ్వసంతాగమవేళ - నలమార వీరకాహాళలోయనంగ* పరభృతంబులు గూసె బల్లవకుసుమ - సరసకుంజంబులు స్మరకలంకారి* పనిగుడారులనంగ భాసిల్లెనపుడు - ఘనతరాశోకముల్లను పట్టెసూన* శరకింకరులనంగ శాఖాగ్రపుష్ప - కరదీపికలచేత కాంతి దనర్చె* మొనవిప్పి మొగ్గలు

మొగలిపూఁబోదలు- ననవింటిదొరగజనాళములనగ* పున్నాగకలితమైపుష్పవితాన-సన్నుతమైగురుజాలకామోద* భరితమైసరసాళిభవ్యమైచారు-తరగణికౌఘసుందరమయివీర*తరులచేఁగవులచేఁదనరిపూవింటి-దొరమజాలీసుతోదొరమైనతోఁట* చెంతలపరము జేసినతివాచీల-వింతలదళబహువిధసూనరాసి*కుట్టిమతద్వనక్షోణిపైఁదోఁచె-నట్టివేళలకంతునమితబలంబు*చలపట్టిహరునియాశ్రమదుర్గమెల్ల- కలకలమనుచులగ్గలకెక్క-ననగ*లోలాళిపికశుకాళులుకొన్నికనక-సాలంపుకొమ్మలసందునఁజెలఁగెనాలోనకాలికమైనవసంత-వేళవిలోకించివిభ్రాంతినొంది*యాదిగాగలబుధులాశ్చర్యమందె-రేదియుదోఁచకయిదియేమటంచు*నిశ్చేష్టనుండెనునీలకంఠుండు-నిశ్చలమతినుండెనిష్టబార్వతియు*కలవాణినవమాలికఁదలయిన-చెలులతోవనకేళిసేయుచునుండె.

సీ॥ఒకవేళనువ్యోలలూఁగుబాలికలతోఁదనమంజుదోర్లతల్ దడబడంగ।సకీపూలచెండ్లాడునొకవేళమంజరుల్ దనకుచమంజరుల్తడబడంగ। నొకవేళవిరులుగోయనుచానసూనముల్ దననఖసూనముల్తడబడంగ। నొకవేళ బ్రియుబాడునువిద చిల్కలపల్కుదన జిలిబిలిపల్కుతడబడంగ। గప్పురపుగంధివనిలోనగలయమెలఁగు।గప్పురపుటనటిబోదెలనుప్పతిల్లి।కుప్పతెప్పలుగారాలుకప్పురంబు।దననగవుకప్పురంబునుదడబడంగ॥

వ॥అంతనవ్వసంతలక్ష్మింగనికలవాణినవమాలికలుతమలోనిట్లనిరి.

రాగంకాంభోజి - అటతాళం.

సన్నుతాంగిరోవసంతునిచేజాలవన్నెకెక్క-యీవనము(అనుపల్లవి) చిన్నిజాబిల్లిదాల్చినసామియీకొమ్మనెన్నడుకరుణించునో॥ఓయమ్మ॥ సన్ను॥ ౧॥కన్నెకనుంగొనుకంతునియేనుంగు।గున్నలలాగున్నగున్నమావి।గున్నలకేమియోకొమ్మజూడుపోకపొన్నాలనున్నయీ పొన్నలచెన్నులు॥సన్నుతాంగి॥౨॥మగువగన్గొనుమునిమ్మగువిరిగుత్తులు। బొగడదగినయట్టిపొగడలు।పొగడలకేమెయోపొలతిగనుమరునికిదగియున్నయట్టిగేదఁగిరేకుబా

కులు॥సన్నుతాం॥3॥తిలకించుమోయువతితిలకమసొగసైన । తిలకములివి ముద్దుగులుకునమ్మా। తిలకములకు నేమి।కలికిజూడవెమల్లె।కలికియైవలచిచెం గటివానిబెనగెడు॥సన్నుతాంగిరొవసంతుని

వ॥అప్పుడప్పుడమిదాల్పు దొరబోట్టియ యహోతడవయ్యె పడుచునెలదాల్పు యొడయనియడుగుల కడకరుగలేదనిన కలవాణికలకలనవ్వి నక్కంబుకంబుకంఠీయతి సౌందర్యప్రకాశుండగు యీశుచెంగటమెలంగునీకు మాబోటిబోటులతో మెలంగిననేమిగల్గు నట్టిగట్టిబత్తిగలనీమీదమహాదేవునియనుగ్రహంబేలరాకుండునెక్లైననతని దయవచ్చినంజాలు నేనునదియె కోరుచున్నయదినీమది నెఱుంగుముగాదెయనునెడ నవమాలికనుగొలిపియెగగొల్పినకలవాణి మఱియునిట్లనియె నోజవ్వనీయీ నవ్వుటాలమాటలకేమి నిన్నొక్కటడిగెదనాయెడ దాచక తెలుపవలయు నద్దేవునకు నుపచారంబు సేయునెడ పుష్పాదికంబులందిచ్చునెడ నుత్తరప్రత్యుత్తరంబులు కరస్పర్శనాదికంబులుగలిగియుండునో లేకయీ రకభావంబులగపడకుండనుండుమరోయనిన నప్పాటలగంధి చిడిముడిపాటు ననేనెవ్వరికి బనులుసేయనోప మదీయజననిదరికరిగెదనని తుఱుమఱవీడ పయ్యెదకొంగుజీరాడ బిరబిరనరుగునక్కరిగమనంగని నవమాలికచెయ్యొడిసిపట్టిమనకలవాణినవ్వు మాటలకేమి తోటిబోటులు నగినకోపగింతురె హిమవంతుండిమ్మహాత్మునకు సేవజేయనియమించె గురునాజ్ఞ మీరుదురావలదురాయని బోధించికళానిధిశేఖరుసన్నిధినుండని యోగించిరంత.

జడగట్టెనెఱులుచిక్కెడలింతునని చేరిగంగాతరంగసంగతికిజంకు। తొడరినెమ్మెయిభూతిదుడుతునేననిడాసిభుజగేంద్రఫూత్కార ములకుదలకు।గళనైల్యమళియనితొలంగదొలగియంగబోయిప్రకటకపాలమాలికలకులుకు।నకటదువ్వలువలేదనికప్పగాంజూచిపులితోలుపచ్చడంబునకు వెఱచుహారునియుపచారమిపముననంటికొనగ।నాత్మందలపోసితలపోసియళుకుజెం

ది|ద్దై వగతిచేతపొసగకతా ళీగాక।యింతి కేల్సోకమునినిష్ట లెట్లునిలుచు॥

మ॥లలితంబౌమధులక్ష్మివో లెమృదులీలంబాలశర్వాంగుళీ।గళితంబౌస్ఫ టికాక్షమాలికహొయల్ గాసీయచేబూనద।త్క్రళచేతంబవడాల పేరని యెదందాదాల్చిచన్ద్రోయిపై। వళితంబౌబలుము త్తెపుఁ సరము శేవఁ భూలి చేనుంచినఁ॥

రాగంశంకరాభరణము - అటతాళం.

ఇదివేళగదయా। హరుని గెల్వ।నిది వేళగదయా ( అనుపల్లవి ) ఇదివే ళగదయనిమదనుడదయతరుమ్రు। నెదవాడికోలలు।గదియనే సేఁ॥ఇది॥సుద తి నెన్నుదిటిపై చెదరుకురు లెగదువ్వి।యెదపైపయ్యెదదీర్చి। యాశుసం ధి నిలిచి।కుమరుగానాలీథపదుడై విరివింట । గదియతుమ్మెదనారిబొదు ॥ కొదమరాచిలుకబల్ ఘోటిపైదిగథుమికి । బోదలుచు లేమల్లెపొదలమాటు నడాగి। బెదరకడాసి। నొగలిబాకు। మదమునదూసి। కేకలువేసి। ముదము తోకోకిలలకదుపులు।రొదలుసేయుచు రెక్కకోపులు। గదురగాఫీటీనివదల క।కుమరుగామాధవుడునిలువగ॥ఇదివేళగదయా.

ద్విపద.

అనీలగళుడుపుంఖానుపుంఖంబు - గానేయుమదనమార్గణజాలముల కు*నోర్వకచలితేంద్రియుండయియతడు-సర్వజ్ఞుడగుటచేసర్వంబుదెలిసి కను రెప్పలెత్తిచెంగట హొరంగైన-వనితగనుంగొనివలపడంగించి * ముం దరనిశితాస్త్రములుజిమ్ముచున్న-కందర్పుఁజూచికన్గవకెంపుదేర *ననుపమ కోపుడైయక్షిత్రయంబు- ననలమయంబైనయట్లుదీపింప * గ్రక్కునతన మహాగ్రతతేటపడగ -ముక్కన్నుదెఱచికామునిజూచుమాత్ర*భస్మీ కృతుండయిపడియుండెమారు-డస్మదీయావనంబగుగాకటంచు * నొకచో టనిలువకనుటకైచైత్రుండు-పికశుకాళులుపికాపికలయిపఱచి* చెట్టొక్క పిట్టనైచెదరెదిక్కులకు-నట్టివేళసుభీతినాహిమవంతు * డేమిసేయుదుగూ తురేమయ్యెనొక్కొ- స్వామికటాక్షమేసరణినున్నదియొ * యనివచ్చిజూ

చియోయమ్మరాగదవె- యనుచు నెత్తుక వేగనరిగి మేనకకు * నప్పగించిము దంబునందిరాయిద్ద-రప్పుడురతిగుం డెలవియ మోదుకొని*సరులముత్తియ ములుజలజలరాల- నెరికొప్పువీడగన్నీరుకాల్వలుగ*ధరణిపైఁబొరలుచుదరి లేనియార్తి- వెరవేమిదోఁచకవిలపింపఁదొడఁగె.

శుద్ధవరాళిరాగం - అటతాళం.

మదనపూర్ణచంద్రవదనపద్మరాగ।రదనమామకచిత్తసదనహామద న ( అనుపల్లవి ) కదనభీమనీచక్కదనముముక్కంటికి। కంటిమంటలకాయె నా।అయ్యయ్యో॥మదన॥౧॥నీవిటులైననానెమ్మేనునిలచెను । హావిధిశిలజే సెనయ్యయ్యో।యీవేళతోడనేవత్తుతుణమోర్చు।జీవితేశనీచిత్తామువచ్చీ ని॥మదన॥౨॥చిన్ననాడునన్నుగన్నబుధులుభాగ్య। సన్నుతురాలనిచాటిచె ప్పిరిగాని। యన్నియసత్యములయ్యెనిప్పుడుపెద్ద।లన్నమాటలెల్ల। నయ్య య్యో॥మదన॥౩॥చెవినిల్లుగట్టుకచెప్పిననామాట।లవునానివినవైతి। వయ్య య్యో। అవులేమనదుష్కర్మమనుభవించువార। లెవరటులైననింకేమిచే యుదాన॥మదనపూర్ణచంద్రవదన.

ఉ॥నాయనుకూలభాగ్యసదనాయనునన్విడనాడనాయమా। నాయ నునిన్నుబాయగలనాయనుయీవెతకోర్చుదాననే। నాయనువేరుసేయ దగునాయనునోమదసామజంపుగు।న్నాయనుపల్కవేమిమదనాయనునేఁ బగదాననాయనుణ॥

ద్విపద.

హాసుందరాకారహారణశూర - హాసుకుమారహాయగరాజధీర*హా మారహావీరహామహోదార - సామియేమోయినాచనుదోయిగాని*ప వళింపవీనేలబడియుంటివిప్పు - డెవరికిమున్నిట్టియెగ్గుజేసితిమొ * యదియి ప్పుడనుభవంబయ్యెగాబోలు- మదికోపమయినసుమంబులేవేయు * నీదయ శాలికాయిటువంటిపాటు - హాదైవమాయనియలగియుల్లనియె * శివునకుకీ డేమిచేసెమరుండు - శివగూర్పదలచుటచెడ్డతనంబె * నదియునుకమలాస

నాజ్ఞ చేబిలిచి-త్రిదశేంద్రముఖాదిగా దేవతుల్వేడ*పరహితార్థమునకై బా
ల్పడవచ్చి-సరసులుసురలుమచ్చరములెక్కించి * మొరటనుబెట్టిమమ్ముల
బాగుజేసి-రరులుగాకాపుత్తలేయక్కటవారు* నాడట్లబల్కు సునాసీరుడేడి-
తోడువచ్చినవసంతుండేడియహహా * నేడుపాతివ్రత్య నియమంబుచేత-
మూడులోకములునిర్మూలంబుజేతు* ననుచుపశ్చాత్తప్తయైయంతలో నె-
యనుపమశమపృథ్వియమ్మహాసాధ్వి*బాధబెట్టగనేలపరులనాకొ యను-నా
థుతోననుగమనంబొనరించి*కైవల్యమందుదుగాకనియగ్ని-దేవునిబహు
శిఖాదీప్తుగావించి*యెవ్వడునిఖిలదేవేశుడై వెలుగు - నెవ్వడుకారణంబీవి
శ్వమునకు*నాయాదిపురుషునవ్యయునినంతు-దోయజదళనేత్రు దోయ
దగాత్రు*నారాయణునివేడినతులుగావించి-యారామశిఖిదరియంగబో
వంగ*హరికృపచేబల్కెనశరీరవాణి - తరుణిరోనీకువైధవ్యంబులేదు* అం
గసంజాతుడనంగుడై బ్రతుకు-నంగయుక్తుండయియగపడునీకు* ననినసం
తోషాత్మయయిరతిదేవి-యనుగమనముమానియాత్మభాగ్యమున* జీవించి
సుందరశ్రీలజెన్నొందు-జీవితేశునిగూడిజెలగుచునుండె.

వ॥అప్పుడప్పార్వతి మనోరథ వైకల్యంబుననగు నపరిమితపరితా
పంబున.

సీ॥తపముసేయుటకునాయుపవనసీమకుబాలేందుమౌళిదా నేలవచ్చె
వచ్చిననేమియవ్వామదేవునిసేవకెలమి మాతండ్రినన్నేలబంపె। పంపిన
మాత్రానపతియాతడనుచునానెమ్మదిశూలిపైనిలుపనేల। నిలిచినంతనెయే
మియుసలసెయాసర్వజ్ఞుడంతలోమరునిరూపణచనేల।నకటప్రియునకునిటవె
గమైననాదు। చక్కదనమేలధనమేలసౌఖ్యమేల । సరసగతులేలమతులేల
చలమిదేల।యనుచువలువంతబలుచింతగొనియెకాంత॥

వ॥అంతకమున్నపురాంతకుండు రతికాంతయత్యంతదుఃఖాక్రాంత
గావునకుపిత స్వాంతమైయేమనునోయనుచింతనచ్చెంత నిలువక కైలా
ససానుమంతంబునకరిగి నిజశుద్ధాంతంబున కేళికాగారతల్పంబున వసి
యించియమ్మించుబోడిందలంచియిట్లనియె.

శ్లోకం॥నాసాగంధఫలీమృదూరుకదళీవాక్కోకిలాకాకలీ। దోర్గ్లీలాలవల్లీశిరోజభసలీహాసప్రసూనావళీ। రాగాలీనకరాంగుళీకిసలయస్స్వర్ణప్రభామండలీ। సాకేళీవనికాస్థలీవకలితాకామస్యవీచీవళీ॥

వ॥అనిమఱియునిట్లనియె నటువంటివాల్గంటి నేడబాసియిటకేలవచ్చితి హాహాయూరకెపరాకైచిరాకైతి నేనారాకానిశాకర వదనకొఱకేగదా హిమగిరికిరాక యట్టినారాకనిరాకరించకగట్టుదొరయు హితవుపుట్టితన పట్టినుపచారంబునకనిచె ప్రేమనాకోమలియుం మెలంగుచుండె నదిసమయంబనియాజవరాలివశురాలిగాజేసుకొనక నంగజునేలభంగపఱిచితి పఱిచిననేమిమఱలనతండుదైవగతి కొనసాగితనపగతీర్చుకొనసాగె నయోకరగతంబగుపదార్థంబువదలితిననియిట్లనియె.

సీ॥అరగంటఫ్రాదిగెయనుచుజూచితిగానిసుదతికన్నులనిండజూడనైతి। కేలంటచిగురుసోకెననియుంటినిగానియదిసందుజేసిమైయలమనైతి। పలుకుచోఁజిల్కపల్కలనియుంటినిగానియతివతోముచ్చటలాడనైతి। నిష్టమేమన్న మోమిటులద్రిప్పితిగానిపొంచియాపనులకొప్పించనైతి। మోసపోయితినికవట్టియాసలేల।యాసలలితాంగిగలయుభాగ్యంబుమిగిలె। వెట్టిజపమువ్వడేలసైవేసుకొంటి।మీదెఱుంగనివారలకేదిసుఖము॥

వ॥అనియిట్లువిసుకంబడి మాటలాడిపునస్సుందరీ దర్శనోపాయంబునకుఁజింతింపుచున్నయెడ భృంగిపరిహాసితాంతరంగి గావుననతనియంగవికారంబులతోఁబొడగని యుడుగనివెతనిట్లనియె అయ్యాయెన్నడులేనిదిట్లు చిన్నబోయి యున్కికేమి హేతువునాతో సెలవీయవలెనననినమినుసిక దేవరయిట్లనియె యోరీయాగిరికుమారీమణినిమరల నేరీతిగందురా అయ్యాం మువదననెడబాసినది మొదలెదదిగులుదీరదు యేవేళనాకన్నులగట్టి నట్లున్నది యేమిసేయుదుననిన వాఁడుగుండెజరుచుకొని అబ్బాయబ్బాలికముద్దరాలనియుంటినిగాని చండికయిదినాడెవెళ్లగొట్టెననింతపని బుట్టదుగదా స్వామీయింతియుకాదు అదిమహాంకాళశక్తిగాబోలు గాకున్నచ్చటనుం

డి యిచ్చటికేలసాడకట్టు యిన్నిబాముల నేలబెట్టు దేవరామీ రేమన్నా అన్నారుగానియింతటబోదు మిమ్మునబట్టనున్నది యంతకంతకుమీ మేను సగంబు సేయుననిన నోరీయేమటకాని దానిజాడకనిముసమైన తాళజాలరా యదిగనుకయెరుకల వేషంబుతోజూచివత్తుననిన నయ్యామీ సేవకురాలిలాగు నేను వెంబడివత్తుననిన నోరీనీవునక్కడ వెట్టిమొట్టిచేష్టలుచేసిన భంగమునుమీయనిన మనబ్రతుకే వెట్టిమొట్టిదైయున్నది యికమంచిచేష్ట లేడవచ్చు సామీయనిపయిన మైరప్పడు.

ద్విపద.

శివుడప్పుడాత్మీయచిహ్నముల్ నూని-నవతనూధవళిమనగవునబూని* కరకురంగాకృతికడకంటనిలిపి-తరుణేందుకళఫాలతటిగీలుకొలిపి*గళనీలచకచకల్ కచసాళినాటి-వళులగాంగతరంగమై ఖరిమాటి*తనయష్టమూర్తులందంబుగైకొనగ-దనయొద్ద నేయుంచిదనరెనోయనగ*పృథివీమహత్త్వంబుపిరుదులయందు-పృథుతరసరసతహృదయంబునందు* బంధుర తేజంబువాతెరయందు-గంధవహత్త్వంబుకాయంబునందు * గగనగుణంబుసైకపుకౌనునందు - తగుజలజాప్తతతనపాణులందు*జెన్నగుజాబిల్లిసిరిమోమునందు-పున్నాగరూపంబుపొక్కిలియందు* నిరవొందభువనమోహినియైన పరమ-పురుషునిరూపంబుపొందుగాదాల్చి*కలికిబంగరుపూలగాజులుదొడిగి-గిలుకుమట్టెలువ్రేళ్లగీలించిచెవుల*కుచ్చులబావిలీల్ గుమ్మటీల్గరుడ-పచ్చలబొగడలుబవిరలుగుల్క*ముక్కునబలుకెంపుముక్కెరచెలగ- పెక్కురత్నపుపూసపేర్లుజెన్నొంద*శిరమునరత్నభాసితపాత్రబూని- యెరికతమైవచ్చెహిమశైలమునకు.

రాగంసావేరి - ఆదితాళం-

అత్తటియెరికతన్మైపొంగియరుదెంచెభృంగీ( అనుపల్లవి ) బత్తితోడమొక్కుకొంటమిత్తిగొంగవెనువెంట॥అత్తటియెరిక॥నెత్తిపైతాటాకులబుట్టనిలిపిగాజుబూసాల। మొత్తములువైచిసొట్టముక్కెరవెలుగ। యిత్తడి

కమ్మలుచెవులు। హత్తించిసవతిదిట్టుచు । కొత్తగనల్లినగిలుక । గుత్తులువాయించుకొంట॥అత్తటియెరికతయైపోంగి.

వ॥ఇట్లుభృంగిశివునియోగంబున పార్వతీభవనంబునకరిగివిచ్చానను వచ్చినయెరుకలదానివలెనేమనుచున్నది.

సౌరాష్ట్రి - అటతాళం.

అవ్వోయవ్వమారాజవేయవ్వ। భాగ్యంగలిగీనేయవ్వ । పాడిపంటలుగలిగీనేయవ్వ।సిరిగలతల్లివేయవ్వ।కొడుకులకోటవేయవ్వ।చుట్టాలసురభివేయవ్వ। బందుగులభాగ్యవంతురాలవెయవ్వ।అమ్మవారమ్మవారమ్మవారు । జగదమ్మజగదమ్మజగదమ్మనీబంగారుకాలికిమొ్రొక్కెనేయమ్మ।అమ్మాదోసెడుముష్టిబుట్టిగాడికిపట్టెడుముద్దబెట్టవెయవ్వ । సోడిగాడునీపై చాలాబత్తిగలిగిజుమ్ముజుమ్మనివస్తున్నాడు। నీరొట్టెనేతబడనున్నది । నీకార్యంగట్టెక్కనున్నది। యనినవినియానగరాజనందనయీయెరుకలదానికొన్నిమాటలడుగుదమనివచ్చియిట్లనియె.

రాగంసౌరాష్ట్రి - అటతాళం.

ఔనెయెఱుకలదానానీవడిగినట్లు యిచ్చుదాన ( అనుపల్లవి ) మానకనేనొక్కమాటయడుగనున్నదాననీవదిని।దానముగజెప్పు॥ ఔనెయెరుక.

వ॥అనిననమ్మాయయెరుకతయిట్లనియెనమ్మానాకుయెరుకజెప్పందోచదు మానాథుండునన్నునాసవతులైన యనేకగణంబులనెల్లక జాతిమాలియొక్క కొండవారిచిన్నదానిదగులుకొూదలంచి వలసితిరుగుచుండె నేనునువానిజాడనెవచ్చినదాన నైనను సూసాయలేకాని మిక్కిలినిదానంబుగాఁజెప్ప నేర మాయెరుకలసానియీసామీప్యంబుననున్నది ఆమె నీకుపత్యెచ్చంబుగానన్నియుదెల్పుననిన నొక్కచెలింబిలిచిశ్రుఘ్రుంబా యెరుకలసానిందోడ్తోనిరమ్మనిపనిచిననదియతిత్వరితగతింజని యేమనుచున్నది.

రాగంసౌరాష్ట్రి - అటతాళం.

నీవటమ్మాయెరుకలసానివీ । నిన్నుబిలిచెనోయమ్మసూయమ్మ॥ అను॥

రావమ్మయెంతో రాజసమమ్మను। హా వేగ మెరవ్మనియం పెనవమ్మా॥మాయ మ్మ॥నీవటమ్మాయెరుకలసా.

రాగం సావేరి - అటతాళం.

ఎరుకలసానివచ్చె ఎరుకనుచు॥అను॥ఎరుకలసానివచ్చె నెరు కోయెరు కోయెరుకోయనుచు॥ నెరు॥మురి పెంపునడలతో డముంగురులల్లల్లాడ।సరసంపుమాటల।చతురతతో।సిరమునవరత్నఖచిత మైనబుట్టబెట్టి। మెరుపువలెను మేను మెరయగను॥ఎరుకలసాని॥

వ॥ఇట్లువచ్చినయెరుకలసానింగనిపార్వతితదీయసౌందర్యాతిశయంబునకత్యాశ్చర్యంబునొంది యుచితరత్నపీఠంబుననుండ నియమించిన నక్కపటప్రబోధిక యిట్లనియె.

రాగం కాఫి - అటతాళం.

ఎఱుక వారుగల రెండతైనమా। కెనవత్తు రెరమణి ) అనుపల్లవి ) మఱియునునీవింక మమ్మనలోకసా। మాన్యముగాఁజూడకె॥యో దేవి॥యెరుక॥ సరసిజభవురాణిపగిణయమాటమా । యెరుక నెగాదటవె। సురపతిపాలో మిశోభనకృతిమా । యెరుక నెగాదటవె॥ యో దేవీ॥యెరుక॥౧॥ గరిమతో మూడులోకములకార్యములుమా । యెరుక నెగాదటవె । తరుణీనీమదికి నేతాత్పర్యాణగాఁజెప్పి।తగుకోర్కెలందెదనె। యో దేవి॥ యెఱుక వారుగల రెండతైనమా। కెనవత్తు రెరమణి-

ద్విపద.

అంగనయామాటలాలించి వేడ్క- బంగారు చేటలోపలము_త్తియములు*ముమ్మారుతనకరాంబుజమునబట్టి-సమ్మతిఫాలదేశంబుననిలిపి* మొ9క్కియిట్ల నెఁజి_త్తమునఁదలపోసి- మిక్కిలికంటిసామికినినామీఁద* నెన్నడుదయ నచ్చు నెపుడు పెండ్లాడు- నెన్నడునా కోర్కెలీడేరుననుచు* చేతిము_త్తియములుచేటలోఁబోసి-నాతియుందిచ్చెనునగు మోముతోడ* నాయెరుకలసాని యాత్మదైవముల-బాయనిభ_క్తితోఁబ్రస్తుతిజేసె.

## సౌరాష్ట్రి - ద్విపద.

సామిసీయప్పతిసక్కరదరుడ- దామోదరయ్యయోదైవాలరాయ
యేదాలుబమ్మకుయిచ్చినతంత్రి-మాదవరాయడమ్మేలువేల్పు*బూదార
రూపంబుబొందినసామి-ఆదినారాయణయఖిలాండకోటి * బమ్మాండనా
యకబత్తరచ్చకుడ - సిమ్మాద్రిరప్పనసీకూర్మనాద * నల్లనిదేవరనాముద్దుల
య్య-తెల్లనినామంబుదిద్దినసామి*నీకుమొక్కెదనయ్యనీలాద్రినాథ-జోక
తోనాకన్నిజొప్పడదెలుపు * బెజవాడలోనున్నపేరైనదురగ - యుజినీమ
హంకాళియోయాదిసత్తి*నికిలేశినారాయణిబద్రకాళి- వికటింపకోశాం
బవీమహాదేవి*మాయాపురీశునిమరగినదేవి- యోయాదిలచ్చిమియోలో
కమాత * యోడకనీయెడనొప్పారగాను - తోడునీడైమాకుదోడుగావల
యు*నోబమ్మయిల్లాలయోసరసపతి- యోబారతీదేవియోపల్కుమాత
పరగంగనాజిమ్మబాయకయుండి - వెరగొందకుండగవృత్తముల్ నుడువు*
యిగనాలుదొలగించెడిగినేశపరుడ-సగినాలులెస్సగాసాగంగజేయ * ను
ల్లంబులోనిల్వుడో జేజెలార-కొల్లాపురీదేవిగూరెదనిన్ను * కాశియొద్దనె
యుండుకాలబైరీడ-ఆశించియీడుండియాత్మలోపలను * వాటిల్లుమేల్ త
లపులోటుగాకుండ-సూటిదప్పకయుండసోద్యంబుగాగ * యీకాంతమున
సునాయెడవచ్చునట్లు-వాకీయరేనాదువాక్కునన్నిలిచి.

వ॥అనియిపుడుమంచియొంటి వాల్గంటినంటితినని కేలుకేలంగీలించి యేమనియెరుకచెప్పుచున్నది అవోదేవీబాగ్యంగలచెయ్యి పతిష్టగలచెయ్యి సంతానముగలచెయ్యి చల్లనిచెయ్యి ఆవోదేవియొక్కతలంపుజేసినావు యొక్కకోరికకడిగినావు యొకదొడ్డమేలడిగినావు అదికాయోపండో కల్లోనిజమో అవునోకాదో చేకూడునోచేకూడదో యని వెనకముందుతొక్కుడుపడుతున్నావు అదికాయగాదుపండు కల్లగాదునిజము శీఘ్రంబేయింతలోనెచేకూడుతున్నది అదియేకొపుకార్యమంటె యిదుగోయీకోపు ఆడవారివంకతలంపా మొగవారివంకతలంపా అంటెయిదుగోమొగవారంటె గడ్డంబుఆడవారంటెలక్కాకు యిదుగో

నీయెదలోతలంపు యెన్నాళ్లకంటె వకటే రెండే మూడే వకటంటేవక
యేడుగాదు రెండంటే రెండేండ్లుగావు మూడంటే మూడేండ్లుగావు శీ
ఘ్రంబెయింతలోనె చేకూడుతున్నది యింకదాపేల చోడిగాడితోత్కై
రబిక్కైరలాడుకుంటాకులకనున్నావె అప్పుడునన్నుమెచ్చేవె కోర్కైలి
చ్చేవే దేవీ యిపుడునీనాథుండునాకుపొడకట్టినామేను వణంకుతుంది చె
మటబెట్టుతుంది పుల్కరిస్తుంది నీకుకనుపించడుగానినీకు నాథుండనయ్యె
దనని యిప్పుడిచ్చటనెయున్నాడు నీపైచాలాదయవచ్చింది శీఘ్రంబే పెం
డ్లియాడు నీకోర్కై చేకూరు నమ్మునాబుట్టతోడనిమరియునమ్మించిచెప్పిన.

ద్విపద.

అంతనయ్యింతియింతంతనరాని- సంతోషమందియాశ్చర్యంబునొం
ది* యిదియేమిరారకోరాయెరికతలెందు - మదికిదోచినయట్లమరికొన్నికొ
న్ని* ముచ్చటల్ దెల్పరో మ్రొక్కినేనడుగ - నచ్చునబోడిచినట్లన్నియుజె
ప్పె*యెరుకలసానిగాదెన్నాపాలి - హరకృపమూర్తియైయవతరించినది
యిచ్చెలిమెచ్చినే నేమిచ్చుదాన-నిచ్చేడెకుజగంబులిచ్చినజాల *వనితనమౌ
క్తికహారంబుకంఠ-మునవైచెమల్లెపూమొగ్గలదండ * వరునిపైవరియించి
వైచెనోయనగ-మరియునునవరత్నమయభూషణములు*విలువలేనివియి
చ్చివిడియంబొసంగి-కలికిజరీబాబువలువలొసంగి* తగినట్టివియనోపదయ
యుంచుమనిన-నగుచునయ్యెరికతననబోడికనియె * యిపుడేమినీతలంపీడేరి
చెలగు- నపుడునాదేకదాయాభాగ్యమెల్ల*నననట్లయగుననియయ్యెరుకత
ను-వినయవాక్యములచేవీడ్కొల్పెనంత.

వ॥ఇట్లపరిమితకృపచపలనయన యెరుకలపడతివీడ్కొలిపి యేగతిపశుపతి
పతిగాగలడనితలంచి తపంబుననేగాని యిక్కార్యంబు సిద్ధించదనినిశ్చయిం
చి నిజాయాసాసహిష్ణులగు జననీజనకులనెట్టకేలకొప్పించి వరయోగా
ర్థంబు వరయోగంబువహించి మత్తచకర్కశతకీవలిపెముడుంగెట్లు స
హించునన్నట్లు వల్కలాంబరంబులుధరియించి చూతమెట్లుసంపెంగదం
డదండనుండవోయనిగండుతుమ్మెదలమెదలకుండగట్టివడవైచినట్లు జడలో

డ లెల్లనలమరచియించి యగణితశిఖి నినాదముఖరంబగు గౌరీశిఖరంబున కేగియందు ఘోరతపంబు సేయుచున్నంత.

వర్షాకాలవర్ణనము.

సీ॥ స్తనితారవార్ఘటీజనితాతిభయవధూ జనతాస్వయంగ్రాహవినుతజనము। కరకాంతధారానికరకాంతమౌక్తికాకరకాయమానభాకారఘనము । అవనీధరస్థలన్నవనీరబహుఝరీజవనాపతద్దరీభవనవనము । విపులావియన్మధ్యవిపులాభపరిపూర్ణచపలాప్రభీతాహిచపలమనము। యఖిలసస్యావనముమయూరౌఘజీవ।ధనముపాంథమనోవిభేదనముజలస। దనముభూదేవతకుచల్లదనమునగుచు। ప్రకటగతిమించెనంతవార్షికపుదినము॥

వ॥ఇట్టివర్షాకాలంబున గట్టుదొరపట్టి బట్టబయలనితంబాచలాలంబికాదంబికాకలిత విద్యుల్లతాలలితమైయుండి వర్షధారలుసిరంబున నుండిపయోధరంబులంబడి కడవలంద్రిమ్మరించినట్లురుల చలింపకనిలింపులకశక్యంబగు తపంబు సేయుచున్నంత.

సీ॥పజుపైనమంచుతుంపఱకుపుట్టినయిల్లుకమలపాళికిమారకగ్రహంబు।చలువపన్నీటికుచ్చాటనమంత్రంబుబీదలవణకింపపెద్దమేకము। చెలువలకుచదుర్గములకుపిరికిబంటుపృథువస్త్రవితతికిత్రప్తికరము । మేడతల్పులుదీయగూడనిముట్టడియైన హారుల్పరువెత్తవెనకతఱుటు । ఓష్ఠకంపమృషామంత్రముచ్చరించి।సమిధలనలంబులందుంచిజ్వాల సేయు। పనులదంపతులెడబాయకునికిజేసి।క్రతువిదియనంగహేమంతఋతువుదనరె.

వ॥ఏతాదృశశీతాకాలంబున శాతోదరిసరోవరంబునకంఠ దఘ్నంబగుజలంబుననుండి నిండుజందురుండు పుండరీకంబుల గండణంచవచ్చినట్లు స్మితకౌముదీసదనంబగువదనంబు వెలుంగ నతినిస్తులరంబగు తపంబు సేయుచున్నంత.

సీ॥భీషణప్రభప్రజపీడబెట్టుటజేసిరవిమిత్రభావంబురాజుజేరె।జనులకుకాల్నిల్పశక్యంబుగాకున్న-ధరణికనంతాఖ్యదట్టమయ్యె । దనునార్పు

జలనామధరము కాననియే మొదపాయించెవనములదావవహ్ని । గిరినిర్ఝ
రంబులింకినవాటతద్గత శైత్యముల్వనితలచంటదాగె । బవలుజలకేళి వెన్నె
లబయలరాత్రి।హిమజలార్ద్రపటీరపంకములచేత। కాలమొకరీతిభోగులు
గడుపుచుండ।భీష్మగతితోడనరుదెంచె గ్రీష్మఋతువు.

ఇట్టిబెట్టిదంపువెట్టకాలంబున గట్టుపట్టియిట్టట్టనరానిబీరంబున పంచాగ్నిమధ్యంబుననుండి తరగనిపదియాఱువన్నెకుందనంపుసలాకపోలికె మహాతపంబు సేయుచున్న సకలలోకంబులు భయోద్రేకంబులై గడగడవడంకు నెడ నాయొయారి చెంగటికిపురారి బ్రంహచారియైవచ్చెనటయెటువలెఁ.

ద్విపద

అలికభాగముననొయ్యారంపువర్ణ - నలదగునూర్ధ్వపుండ్రము బెట్టి
హస్త*తలమునపాలాశదండమ్ముబట్టి-కలితమధ్యమునచక్కనిమౌంజిజుట్టి
బలువన్నెగులికెడుపావలుమెట్టి- సలలితంబైనపచ్చనిగోచిబెట్టి * పొలు
పొందపుస్తకంబులుమృగాజినము- కెలకులవచ్చుభృంగికినెత్తిబెట్టి*పదియు
నారేడులబాలుడైనట్టి-యుదయార్కుడననురుద్యుతిగనుపట్టి*వామనుండ
గుజగద్వల్లభుపటిమ-వామదేవుండప్డువటుడయివచ్చె.

వ॥ఇట్లువచ్చివచ్చియచ్చటపరమపావనంబగు గౌరీతపోవనంబుగాంచి యందులశుకపికాళులకు విందులగుమాకందకుందబృంద చందనపిచుమందమందారాది తరులదరులతిన్నని సురపొన్నగున్నలనీడలజాడల కిసిమిసితీవలతోవలనెత్తమ్మికొలంకుల కెలంకుల వచ్చివచ్చియచ్చోడియజపావసానంబునమితఫలాహారంబొనర్చి మేలిమివన్నెశాలుజీరాడ పయింజేర్చి యిష్టసఖులతోగంగాతరంగిణీ సమీపరంగన్మణి గృహాంగణంబునఁగురంగధరకాంతకుట్టిమతల్పతలంబున విశ్రమించుచున్నయెడనక్కన్నియం బొడగాంచి యబ్బురంబుననురాగంబునుగుబ్బుకొన సర్వజ్ఞుండయ్యును మోహాంధకారంబునం దెలియకనిట్లనివితర్కించె.

శ్లో॥యదజ్యాంధనుర్ఝ్రామిషం తేనపీఖాశరాళీంకిరంతేస్మరంజీపయం తే।మనఃపశ్యతోహారిణీమేవిలాసాదియంకాస్వయంకామమాయేవభాతి॥

శ్లో॥కమలతాలలితాగమనాంచితా। కిముధరారుచిరాధరరుగ్వరా కిముకలావికలాశశినఃకలాకిముఘనాపఘనాజలజాననా॥

శ్లో॥కుచజితసురాలయేయంవితతనితంబవిలాసవంచితోర్వీ। వేణీహృతాహిధామా ప్రాప్తాచేత్కామినీత్రిభువనైఃకిం॥

శ్లో॥నస్థూలానాతికృశానహిదీర్ఘానాపివామనా। లలనేయంకలితాతుయథాకామం।మచ్చిరకృతభాగ్యహేతుతపసైవ॥

ఉ॥కన్నదిలేదుఇట్టికలకంఠినొకప్పుడుదిద్దివేసిన। ట్లున్నదిముక్కు చెక్కుగవయొప్పిదమౌరమెఱుంగుదోమిన। ట్లున్నదిసోగకన్దళుకుటొయ్యరమేమనవచ్చునైనయా।చిన్నదితుంటవింటిదొరచిల్కయొముద్దులుమూటగట్టెడిన్॥

ఉ॥చన్నులుపొన్నకాయలకుచక్కదనంబులొసంగుకల్కివా।ల్గన్నులుగండుమీలకుని గారములిచ్చునొయారిదీనికే। యన్నులుసాటిరాగలరుహాయొకమాటటుజూచినంతనే। నన్నులుకంగజేసెరతి నాథుడునైజధనుర్గుణధ్వనిన్॥

చ॥కలకలనవ్వునెమ్మొగము కంచెలనీటెగమీటుగబ్బిగు।బ్బలబలవంతపుంబొగరు బంగరురంగుమెఱుంగుచెక్కులుం దళతళలీనుమైమెయిలనందగునందపువేణిదీనితోఁ। గిలకిలలాడుచున్మదనకేళిబెనంగెడిభాగ్యమెన్నడో.

ద్విపద.

అవురముద్దులగుమ్మయపరంజిబొమ్మ-చివురువిల్తునిముల్కిచిల్కలకొల్కి*కలికిపూదెప్పచక్కదనాలకుప్ప-తళుకులదొంతికందర్పునిదంతి*కలువలచెలిరేకకనకశలాక-తలిరులేమొక్కమేల్తళుకులచుక్క*కమ్మనిపూచెండుగజనిమ్మపండు-తమ్మిపూతేటయందమ్ములమూటు*కాయజుతోఁట

బంగరువన్నె తేట-సోయగంబులవిందుచొక్కులమందు* గోరవంక నెలకొనకులుకులసోన-తరుణీలలామసౌందర్యాభిరామ * జలదమేచక వేణిజలరుహపాణి-సలలితపిక వాణి సైకతశ్రోణి* బాలేందుఫాలదర్పణసత్కపోల-లీలాలవాలలాలితదంత చేల* నవమందహాససుందరతిలనాస - యువిదలలోమిన్నయొయ్యారికన్న * కన్నులకల్కిచక్కనిగుబ్బలాడి - యన్నన్నమాధుర్యమహాహాలావణ్య* మెన్నగాశక్యమెయెవ్వరికైన- కన్నదివిన్నదిగాదీయొయారమీముద్దుమొగమేమియీసొబగేమి- యీమేనిబందుబస్తేమిశౌబాసు*మేలుభళీయంచు మెచ్చిసొక్కుచును - యేలీలనీబాల నెన సెదననుచు*నతినిష్ఠతోడమాయావటుడైన-శితికంఠుడబ్బోటిఁజేరంగనరిగె.

వ॥అప్పుడప్పార్వతి చెలికత్తెలతనింగని యోబాలానీపాలిసాంబశివుండునుంబోలె మహాతేజోధారియగు బ్రహ్మచారియేతెంచె మహాత్ములువచ్చినపరమలాభంబని చెప్పుదురుగావున నోయక్కా నీవితనికిమ్రొక్కియితనిచేత దీవనలందుమనిన నగుగాకయని యుచితసత్కారంబులుగావించి సముచితాసనంబుదెప్పించిన నక్కపటవటుండు శీఘ్రంబె వివాహాశిద్ధియగుంగాక యనిదీవించి సుఖాసీనుండై యిట్లనియె.

రాగంసారంగ - అటతాళం.

ఎవ్వారిదానవేబాల-నీ-విట్లుతపముసేయనేల ( అనుపల్లవి ) జవ్వనినీకోర్కె-సఫలముగజేయ। జాలుదుదెలుపుమీ। వేళనోబాల॥యె॥౧॥ కన్నియనీదుపేరేదె।యెవరి। చిన్నదానవోదెలుపరాదె।వన్నెవాసిగల। వారిపడుచువలె। నున్నావుయీతోఁట। నున్నకారణమేమి॥యె॥౨॥ వెన్నెలన్వడదాకుమేను।యింత। వేసటబెట్టుటమాను। కన్నులకింపగుకలువపూవులదండ।యున్నతాతపమున।నుంచిననెట్లోర్చు॥యె॥౩॥ఎన్నంగవనదేవతవో। లేక। హిమగిరిముద్దులసుతవో।అన్నిసొగసులునీ।కలరారెనీరీతి। యున్నట్లుదెలుపవెయోముద్దుగుమ్మ॥యెవ్వారిదానవెబాల-నీ-విట్లుతపముసేయనేల.

చ॥ నెలతుకసిగ్గునందెలుప నేరకయూరకయుండిబోటియా। నలకల

వాణిఁగన్గొనిన నచ్చెలియిట్లనెనో మహాత్మయి । య్యాళికచశైలనందనయుమాఖ్యదగుఁ శివుఁబెండ్లియాడఁగా । దలచితపంబు సేయునిదె తథ్యముగానిటువిన్నవించితిఁ॥

ద్విపద.

అనినపక్కననవ్వియాబ్రహ్మచారి-యనురక్తిగదురనిట్లనునుమతోడనెక్కసక్కెమునిక్కమేపల్కనదియొ-యక్కటహరుబెండ్లియాడెదననుచు* నేలాగుదోచెనీకిటువంటిబుద్ధి-బాలరోనీబుద్ధిబంగారుగాను*కినుకనన్నిట్లుభంగించిరెవ్వారొ-వినవెయాభూతేశువృత్తాంతమంత*కులగోత్రములులేవుకుక్షింభరుండు-యెలనాగరోభిక్షమెత్తుచుఁదిరుగు * నెవ్వరుముట్టనియెముకలేదాల్చు-నవ్వగాదయయొమానవిహీనుడతఁడు*బట్టగట్టడువెఱ్ఱిబాగులవాఁడు-యెట్టికర్మమొబూడిదేబూసుకొనును* యొకపౌరుషముజేసెనోముద్దుగుమ్మ-యకటకటాబ్రహ్మహత్యగావించె*బహుతామసపువాడుపరమధూర్తుండు- సహవాసమాపిశాచంబులతోడ * నేనేమిసెప్పెదనీవెభావించు. యేనుగాగుఱ్ఱమాయెద్దెక్కుటేమి* రోదనకరుడౌటరుద్రాఖ్యవచ్చె-నేదిచూచినశుభమించుకలేదు*నీసోయగమునకునీభాగ్యమునకు- నీసరసత్వవర్ణితగుణంబులకు * నెంతచక్కనివానినెంచుకొన్నావుయింతిరోచూడవాయెగదిగకన్న*లాబొల్లిమేనేమియాయందమేమి- శాబాసుశాబాసుచిత్రమయ్యెనని*యలరారుమేడలోహంసతూలమున-బొలుచునీవలరుద్రభూమినెట్లుందు*వహహాయెట్లబ్బగాఢాలింగనంబు - లహులపేల్లుబ్బనీయారుపైకినుక-హరిహరివిషదగ్ధమగువానినాల్క-సరసంపువాతెఱచవిగొనుటెట్లు* తెలియకంటినిచేఁదుదిన్నట్టివాఁడు - లలనరోయింతబెల్లపుముక్కకొఱకు*శ్రీరామరామయీచెడుబుద్ధిజెప్పి- యోరామయెవరునీయుసురోసుకొనిరొ* పంకజాక్షిరోమశిపాతమానికము- కొంకకకాకిముక్కునదొండపండు*కట్టినట్లగునింతకంటెనుపుస్తె-గట్టుకోమేలుచక్కనిస్థాణున్నైన* నగుబాట్లపనియిదినమ్మునామాట - తగదునీకతనికితర

ళాయతాక్షి* నేనై తెమలిజి తేం గ్రియుఁడ నేకాని-నీనిమిత్తమ్ము పెండ్లికీని
నొప్పెదను*స్వాధ్యాయ మెల్లక్రమాంతంబుగాఁగ-నధ్యయనాధ్యాపనా
దికంబయ్యె*బ్రహ్మచారినిలోకపావనాత్ముండ- బ్రాహ్మణుండనుబీదబావ
డగాను*హరికృపగల్గుసర్వైశ్వర్యములును- కొరతలేదిప్పుడెకొండయ్యెకై
దవు * ఇపుడేమి జెప్పుదునీమేనునీది - తపముజాల్లెమ్మునాతరుణివిగమ్మ

సీ॥అనవుడుబలువైనకినుకతోనిట్లనువనజాక్షుభక్తుండువర్ణియనుచు.
బూజగావించితిపురుషోత్తమాంఘ్రిభక్తులుమహాశాంతియుక్తులుదలంప,
కలనైనపరనిందగావించవినలేరుగావునవీఁడుమాయావినిజము।శివుశంభు
నీశ్వరుచిన్మయానందునినిష్కళంకునివీడునిందజేసె। బ్రహ్మచారిగాడుపర
మకామాంధుండు।బోటులెల్లఁదగ్గబుద్ధిజెప్పి।వీనినిచటనుండివెళ్లగొట్టుడుశీ
ఘ్ర।మనుచులేచెసిగ్గునను నెలంత॥

చ॥తొడసునుతక్షులుప్పతిలఁదొయ్యలులయ్యెడవల్వవెన్కకై। ముడి
చిపయింటలోరవికముళ్లుఘటింపుచుపోకముళ్లుక్రొ। మ్ముడులుబిగింపుచుం
బోమలుముళ్లిడిపెల్లునవేషధారియా। వడుగుపయిన్వడిన్గవయవచ్చినగన్గొ
నిభృంగియిట్లనున్॥

రాగం కన్నడగౌళ - అటతాళం.

ఏమి సేతుదిక్కెవ్వారునీకింకనయ్యవారు-యిదుగో- కామినిభూతా
లగతివెంటబట్టెరయ్యయ్యవారు। ఎందేలజరుగక। నిందేలవచ్చితెరయ్యవా
రు।వచ్చి-పొందుగనుండక। పోకెళ్లబోనేలనయ్యవారు॥ ఏమి ॥౧॥ బులుపు
దీర్చినిన్నుపొంకబెట్టకపోరయ్యవారు-యిందు - నిలువగరాదింకనేనెంచుజ
రుగుమనయ్యవారు॥ఏమి॥ ౨॥ వదలరునేదొడ్డబ్రహ్మచారినన్నయ్యవా
రు।మిమ్ము।పదిలపజెచివీరుభంగపెట్టకపోరయ్యవారు॥ఏమి॥౩॥ పదమువడిగ
నేబట్టినతాళలేవయ్యవారు - యీ - మదవతులూనరించు మర్దనకెట్లోర్తుర
య్యవారు॥ ఏమి॥౪॥ భ్రమలేలవనితలపాలయితివయ్యమోఅయ్యవారు
యింక- సమరసమునవాకు జతువెవరుజెప్పెదరయ్యవారు॥ఏమిసే॥౫॥

వ॥ అనివగల నెగచుభృంగింగనియంగనలుక నలి మొఱలు వెట్టకుండముం దరపీఁడింబట్టుకొందమనిదగ్గిరచీకాకుగావించినవాఁడు ఇదియయ్యవారిపుస్తకంబులు వీడిపోయినంగడుచిడుముడిపడుజుమీయిదియయ్యవారి జపాసనంబుముట్టకుండుఁడుకట్టువిడిచినజెట్టిదంబగుధావంతంబులు జుమీయనినవారువిక వికనగియికనీయయ్య వారికివచ్చుపాట్లు జూచెదవని మరియువడికొనిన వాఁడు మొఱలు వెట్టుచు మీపుణ్యంబువడులుండని యినుమునగూడియగ్గికిసమ్మెటపెట్లన్నట్టుయీయయ్యవారినుంచినాపనిబాగాయె నీయయ్యవారియొద్దజదువవచ్చిననాటనుండి ఓనమశివాయయన్నయీయయి దావచ్చరంబులైనను కుమరజెప్పలేదు యింకనీయయ్యవారి పొందుజాలు నీయయ్య వారినిమీ రేమట సేయుండ మిమ్మునీయయ్య వా రేమటచెయ్యనీ నాకక్కఱలేదనిపరుగులిడుచు పాదభగ్నంబై నట్లకుంటికుంటిపడుచు పిట్టబెదరినమిట్టిపడుచు కంటకశాఖశిఖదగిలిన విడువిడువుండనిచెలుల బతిమాలుచు కతుపాలభుజంబునమాటిమాటికిందాకిన పొడవకుండనిచెలుల బతిమాలుచు వికారంబులుసలుపుభృంగింగనివానివపలి యాబ్రహ్మచారి వేషధారియగుపురారింగదసి.

సీ॥ కటిసూత్రమేపాటిగట్టిబాపడయని దెబ్బనమొలత్రాడుదెంచెనెక తె। యంటెమాచెలితానమాడుమంచుఘటంబువంచినీట్లబ్రిమ్మరించెనెక తె। మెనగావుపెండ్లికియెదిగింతుననిపిల్లశిఖలాగిమిన్నందజేసెనెక తె। పులిభయంబిచటపోపొమ్మనిహుమ్మని పులితోలుపైవైచిబొదవెనెక తె। యట్టియవమానవృత్తిసత్యప్రసిద్ధి। గగనగగనాంబరుండుగంగాధరుండు। వ్యోమకేశుండువ్యాఘ్రచర్మోజ్వలుండు। నగుచునగుచుహరుండుప్రత్యక్షమయ్యె॥

ద్విపద.

అరిలిగజదానవారాతినిల్వ-నారీమణులుసునానాంరీతిబరచి॥ భయసంభ్రమంబులుభయము రెట్టింప-రయమునజనిశంకరయలీలలెల్ల ॥ నగజకుదెల్ప

నెన్నగరానిభీతి-యగణితవ్రీడబాయగరానివేడ్క * గోనబుగాముప్పిరిగొ
నఁబువ్వుబోఁడి-తనులతవడకఁజెంతనులొంగియున్న*కలవాణిసతిజూచిక
లకలనవ్వి-యలరుపూబోఁడిమాయలబోకయుండ*తగబుద్ధిజెప్పితిధవునకీ
వనిన-మగువనవ్వుచువనమాలికయనియె*అకటనాథునినేమియాపదబెట్టి
సకియయాతనిబ్రహ్మచర్యంబుమాన్పె * ననగౌరిమీపుణ్యమయ్యానిగా
ని - ననుమీరలివ్వడేనవ్వగావలెనె * యనిదండములుబెట్టునవసరమునను-
తనవృషతురగంబుదాటించుకొనుచు* ప్రమథగణంబులబయలనేయునిచి-
రమణీయరమణీవరమణిగృహంబు*దరియంగజనిమహాదరణంబుతోడ - త
రుణేందుమౌళియ త్తరుణికిట్లనియె.

రాగంహుశ్శేని - అటతాళం.

రావెముద్దులగుమ్మాసద్దలెనన్నలే॥రావె॥ ( అనుపల్లవి ) రావెనావె
తదీర్చనీవెకౌఁగిలీవె।చేకోవె॥రావెము॥నేనెనీమరులుగొన్నానె । తాళలే
నేమ్రొక్కేనె॥రావె॥౧॥ఇందువదననీ।పొందుగోరుకొందునేముందు ॥ రా
వెముద్దులగుమ్మ.

మ॥చలమేలేచెలిమేలెచెంగలువనేజాపాదుశాతమ్మిము । ళ్ళులదూ
లించెడుజూపువెన్నెలలతళ్ళుల్ నాపయింజల్లవే। కులుకుంగుబ్బలగౌఁగిలిం
చుకొనవేకెూర్కెల్తగందీర్చవే । యలివేణీజలజాతపాణిరమణీ। హాకీర
వాణీమణీ॥

క॥అనిమఱియుఁబెక్కుభంగుల। వనితామణిదూరిదీనవచనరచనలఁ।
మినుసికదేవరవేడిన।ఘనలజ్జావశతఁజెలియఁగనియిట్లనియెఁ॥

రాగంపున్నాగం - అటతాళం:

చెలియనీవుదెల్పరాదె।తలిదండ్రులచాటుదాననని॥చెలియనీ॥ రమణి
రోసర్వజ్ఞులయినవారు।తమరెఱుంగనిదేమిధరణికులకాంతల। క్రమమిట్లు
గాదునేరనిదాననాతప్పు।క్షమసేయవలెనిదిసమయముగాదని ॥ చెలియ॥
౧॥ముదితతమరుమిన్నుముట్టినవారలు। కొదువగాకయెునగూర్చగదగుకా

ర్య । మిదియేమి వేగినన్నీపాటిమాత్రాము । మదిచిత్తగించి నామనవి జేకొనుమని॥ చెలియ॥ ౨॥ మగువరోయింత సామాన్యముతమ కేల। జగమెఱుంగగఁబెండ్లి సలుపగవలెగాక। సగుబాటుగాకుండ। నగరాజు చెంతను। దగువారి బంపుటధర్మపద్ధతియని॥ చెలియనీవు॥ ౩॥

## ద్విపద.

అనికొమ్మపలికిననగుగాకటంచు - దనమదివిరహవేదననిండుకొనగ* నంతర్హితుండయియంతకాంతకుడు-చింతచేఁగైలాసశిఖరికిఁజేరె * నిక్క-డపార్వతియెన్నగారాని-చక్కెరవిలుకానిచటులబాణములు*పదులునూఱులు వేలుబహులులకుకోటు-లుదుటుగానెమ్మదినొక్కటనాట*లొళజాలగ లేకదరిలేనియార్తి-సోలుచుమాలుచుసుదతులమీఁద* వ్రాలుచుమిన్నుపై వ్రాలినయట్లు-బాలికబెగ్గిలిప్రాణేశుడిప్పు* డెందుబోయెనటంచు నేమియుదోచ-కందంద వెదకుచునలరుపూబొదల*సందులగొందులసరసనీక్షించి-యిందుమాళిని గానకింతిలతాగ-బృందంబులన్నిటిబిలిచియిట్లనియె.

సీ॥ కనకభూధరధన్విగనరె తేజఃకనకంబులారా కనకంబులార। తిలకించరే చారుతిలనాసుగుజతిలకంబులారా తిలకంబులార। కరగతకమలుజూడరె సంశ్రయత్క-మలంబులారా కమలంబులార। నవరసాలయునిగానరె శుకాద్యమదసాలంబులారా రసాలంబులార। మల్లికార్జునేశుమటికనుంగొనరెయా। మోదమెల్లగూర్చి మొల్లముగను। మజ్జనకునిగవయు మల్లికావల్లిమ। తల్లులార నాదుతల్లులార॥

వ॥ అనియిట్లు వెదకివెదకిమదగజగమనమదనదమనుంగానకదీనకళనున్న పచ్చవిలుకాడుమునుపటి పచ్చిగాయంబులపై విచ్చలవిడిపెచ్చు పెరిగిక్రొత్తవిరిములుకి-మొత్తమ్ములుహత్తించిన బిత్తరితత్తరిల్లియాతపోద్వేల్లియగునుత్పలవల్లిపగిదిమూర్ఛిల్లిపల్లవపాణులొనరించు శైత్యోపచారంబులవలననెట్టకేలకుఁదెప్పిరిలియుస్సురనియిట్లనియె,

రాగంసురట - ఆదితాళం.

ఏమిసేతుచెలులారపతిగననేరనైతి- నేనే- ( అనుపల్లవి ) ఏమిసేతు నా। సామికామదమును। నామకొనిచనుగవనునలమక। యామరునిగరువం బుదీరదు॥ఏమి॥సుదతిరో యెంతచోద్యమొకానినా।యెదుటికితానైవచ్చె నె। నె।మ్మదినాసోయగమెంతో మెచ్చెనే। కోరకె ।లూదవించుమనసిచ్చెనె। కూడదిప్పు। డదియానికాదం టెకటకటావాని । గదియాకయారకుంటివా లుగంటి।మడముగదురగ।కొదమతుమ్మెద।కదుపులదెయిదెరొదలు జేసెను। మదనవిహారణసదనములగతి।బొదలుక్రొవ్విరిబొదలచెదరుచు। అదరకాబె దరకాశుకములు।వదరజొచ్చెనుకోకిలంబులు।కదలకామెదలకాడగ్గరి। వ దలకదయతగూసెనయయో॥ఏమిసేతు.

చ॥తనపతివచ్చునంచునిశితానమొనర్చసువర్ణకుంభమం । బునిలయ మందుముంచెననమున్గనిసుండపరాబ్ధిదగ్గళ। స్తనయుగకుంకుమద్రవవిధం బునసంజయటంనెఱుల్ విద। ల్చెనననిరుల్ తదంబుతతిజిందెననానుడురా జిరాజిలె॥

సీ॥ఉదయాద్రికరిమీఁదిహురుమంజిచౌడోలువెడవింటిపాదుశావెల్ల గొడుగు । తమిచకోరములుపాల్దాగుపువజ్రపుగిన్నెనిశిమీదజల్లుపన్నీటికు ప్పె।గగనమన్పందిరిగట్టుముత్యాలగు త్రివిష్ణుపదంబుపెన్వెలినఖము। తెఱగంటి గమిబువ్వదినువెండిపళ్లెంబుగగనసౌధాగ్రాబ్జకాంతకలశ । కాలసురభూ రుహముపండుగగనలక్ష్మి। చేతిపూచెండుపాంథగర్వాతిశయము । గృంగ కంతుండువేయుపిరంగిగుండు।సుందరాకృతిదగెనిండుచందురుండు॥

వ॥అప్పుడవ్వేడవింటిదిట్టబెట్టిదంపువెండిచుట్టీటికట్టెలంబట్టి గ్రుచ్చె త్తినట్లు ధవళకిరణుకిరణంబులుచుఱుకుచుఱుకునను గ్మంబులంటిన గజగ మనగిజగిజలాడితాళజాలకమూర్ఛాగ్రమ్మి సొమ్మసిలిన నలినవదనలుబెద రిపడియుపారంబులగు శైత్యోపచారంబులుగావించిన తాపంబుదీరవిూచ లువపన్నీటనీటముంచిన నాహీముచారి కళపెళనుడికె నంతకొంతదడవున

కనీశ్వరానుగ్రహంబునం దెప్పరిలి ముప్పిరిగొన్న మోహంబున నదె మదన దమనుండని కలువరించి భ్రమసి చూచి కానక లేచి యడుగులు దడబడ మొడలి సొమ్ములు సడలిపడ యేమియుం దోచక తోఁటవెంబడిం బడి దిరుగ వెన్నెలచిచ్చున కుందొడు తమ్మికొలంకుల గ్రుమ్మరు కమ్మగాలి వచ్చిన మిగుల నొగిలి తెగువ సేయు తలంపున నరవిరిసిన చెంగల్వపూఁబంగరు గిన్నెలోఁ దేనెవిసంబు ద్రావ గమకించు దిట్టచెలులచ్చెలిని దొలంగించిన బెనఁగి నన్నెలయాపద బెట్టెద రేయని యయ్యొప్పుల కుప్పని గురుగప్పిన నిప్పుల కుప్ప యొప్పున నరవిరిపరపునం బడి మదనాంధకారంబు ముంచుకొన్న చొప్పున వీడి యొడలెల్ల గప్పుకొన్న గొప్పకప్పుకొప్పు పగవారికి పగవారి పగవారు బంధువులని చంద్రద్వేషిణియగు నప్పడతుక కౌఁగిలించుకొన్న కటికచీకటి యోయనజెన్నెనగన సురుసురని పొరలు పొరలి దరిలేని బెడిదంపు వెతగడగడవడంకు వడంకి వెన్నెల వేడిమికి సొమ్మసిలు సొమ్మసిలి వీఁడె వీఁడె వాఁడు వాఁడు కాఁడు కాఁడని పలువరించి యురికి దిగ్గన లేచి నల్దిశలు జూచు కారణంబు లేక యూరక పకపక నవ్వు పిలిచినం బలుకకుండు పిలువకున్నం బలుకు నిట్లు తన్మయావస్థం జిక్కి చక్కెరబొమ్మ వెక్కి వెక్కి ముక్కంటిపై మక్కువ గన్నీరు మున్నీరుగా వగవ నూడిగంపు చేడియలు బలువగపులతో నూరడింపుచు మరందంబులానుమిళింద బృందంబుల యందంబున విరిపరుపునం బొరలు పెన్నెరులు సందెగ్లం బట్టి గట్టిగా ముడిగొల్పి కన్నీరు దుడుచు వారిం జూచియూ యాయ్యాసమేల నాయాసవదలుండు ఋణానుబంధంబిట్లుండె నాగతిజూచి నీచిరుతలత మూనలకు నీచిన్నికన్నె పొన్నగున్నలకు నాదరణంబున పరిణయోత్సవంబు సేయుండని యొప్పగించి బెట్టిదంబగు యంతర్గతదుఃఖంబు పట్టజాలక యామధురవాణి నీలవేణి పాణిక్వణితమాణిక్యవీణా గుణనిక్వాణ మాధురీధురీణంబగు నెలుంగెత్తి భోరున నేడ్చిన స్వాజాత్యరవశంకం బెదరి కిలకిలమనుచు కోకిలలుం జిలుకలుం గదసి పలుదెఱంగుల గూయం దొడంగిన చెలిమికత్తెలు తత్తరిలి బిత్తరి నిత్తోఁటనుంచుట మంచిదిగాదని చంద్రిక సోకున కుతలగి జిలుగువలువము

సుంగిడిన వడపోసినట్లున్న వెన్నెలనిగ్గునాటుకొన్నట్లు విరహపాండురం బగు తనువుతమపయిం జేర్చుకొని సఖీయూథంబు తదవరోధంబులగు నిజకేళీమణి సౌధంబుదరికిదెచ్చిన తచ్ఛిఖరంబున నంటినట్లుల్లసిల్లు జాబిల్లింగనివీఁడె మన మేడమీద రేఱేఁడున్నాఁడు వీనింబట్టుకొందమని సోపానవితానమార్గంబునజన దివురుచివురుఁబోఁడిమౌగ్ధ్యసాహసంబున కరుదందిచెలియలమ్మా వీఁడు రేఱేఁడుగాఁడు మండలీకృతకుసుమకోదండంబ దెకలంకంబుగాదుమధుపశింజిని యవిధవళకిరణంబులుగావు పుంఖానుపుంఖసమాగత మదనమల్లికాముకులీ మార్గణంబులనిబోధించి హర్మ్యాంతరశయ్యాంతరంబుననునిచిన నబ్బోటిజాబిల్లి రాగోడలఁ బ్రతిఫలించునిజవదన బింబంబుల నేక శశిబింబంబులుగాఁదలంచి బెగ్గిలి సౌధంబు వెడలి వచ్చి కురంగటహెురంగ్గైన బంగరుటుంగుసంగూర్చుండి చంద్రునుపలక్షించియిట్లనియె.

చ॥ మతిచెడిరాత్రిగ్రుమ్మరిహిమంబుమియంగననాథత్రైనస। త్సతు
లనుసాధుచక్రములఁదమ్ముల నేచగనెట్టిరాకయ। ద్భుతపరిపూర్ణవైకృతిని
బొందగజూచివిరించినిన్నళా । గతిశశపాళిశృంఖళలగట్టిపయోనిధిముంచు
నిత్యముఁ॥

గీ॥ ఉదయమైనది మొదలుగానెక్కు పెద్ద । చెవులపిల్లినినడ్డంబు జేసిప
ట్టి। యోరిద్విజరాజనీవును నెంటదిరిగి । కొనుటపాంథులయశుభంబుకొఱ
కుగాదె॥

సీ॥ మొగముజూడక యింత వెగటుగావించుట యందమాయిదినీకుచం
దమామ । మనసులో మెలగుచుమర్యాదదొలగించిమనసునొప్పింతురామన
సిజాత। ప్రాణబంధుత్వంబుబాపిగాలిపిశాచ మనసోకిమేఁతురాయలసప
వన[illegible]ంచితనంబుమానియింతయెగిరిపడుచురశుకపికపాళులార। తు
మ్మెదనటంచు నేవనిదోచకుండ। దరిమిఝుంకారములు సేయదగు నెభృంగి। నీ
లకంఠాఖ్యపురివిచ్చియేల కేక। లూనర వే సెమసిగ్గుమాలినశిఖండి॥

వ॥ అనిఇట్లనేకవిధంబులఁజంద్రాదులనిందించి యంతకంతకగ్గలంబగు విరహవేదనంగుంది నానావస్థలంబొందిన చెలిమికత్తియలు బిత్తరికిశిశిరోపచారంబుల సేదదేర్చియయ్యింతి వృత్తాంతంబంతయు మేనకాహిమవంతులకెఱింగించినవారును భయచింతాసంతోషంబులు ముప్పిరిగొన సర్వమంగళావివాహమంగళకార్యంబు శ్రీమన్నారాయణానుగ్రహంబునంగాని సంఘటించదని గోవిందపాదారవింద ధ్యానాధీనమానసులైయుండిరంత.

ఉత్సాహవృత్తము.

ఘనవినీలరుచివిశాలకనకచేలవిద్విష।జ్జనవిఘాలదనుజకాలసత్వలీల యిందిరా।మననమూలమహితఖేలనూన్యధీలసద్గుణా। వినుతశీల వేదలోల విబుధజాలపాలనా॥

గద్య.

ఇది శ్రీమన్నారాయణ చరణదాస్య పవిత్ర గోకులపాటిబుచ్చ
నామాత్యపుత్ర శ్రీమత్తిరుమల పెద్దింటి సంపత్కుమార
వేంకటాచార్య దేశికానుగ్రహ సనాథ శ్రీకూర్మ
నాథప్రణీతంబైన మృత్యుంజయవిలాసం
బను శృంగారనాటకగేయప్రబంధం
బునందు

శ్రీరస్తు.

## మృత్యుంజయవిలాసము

### తృతీయాశ్వాసము.

శ్రీమత్త్రయీవతంసిత। తామరసచ్ఛరణపత్త్రిధవహరివాగ్మ। క్షోమ
లశ్యామలతనుయుత। చామీకరవాససర్వజగదావాసా॥

అవధరింపుము.

గీ॥ అంత ప్రొద్దువొడిచెన గజకేశుఁడు గట్టు। కాలము నెడు స్వర్ణకారకుం
డు। దనరపాడపుగొండదాగటిపై నేర్పు। బొదలజేయు తాళిబొట్టనంగ॥

వ॥ అప్పుడు శ్రీమన్నారాయణప్రేరితులై సమస్తమంత్రరహస్య
పుడగు కశ్యపుడును తపఃపూతగాత్రియగు నత్రియును దివ్యతేజస్సమా
జుండగు భరద్వాజుండును నిరస్తాంతరామిత్రుండగు విశ్వామిత్రుండు
ను నుత్తమోత్తముండగు గౌతముండును నరుంధతీసహాయ గరిష్ఠుండ
గు వశిష్ఠుండును శాంతఖనియగు జామదగ్నిమునియును నేతెంచు నెడ
దివ్యమణిభానుమంతంబగు కైలాససానుమంతంబున పార్వతీవిరహదు
రవగాహకాయ జశరనికాయదోదూయమాన మానసుండగునస మలో
చను ... యం దిందుకాంతశిలాతలంబు

సామి। యోరి
॥కడు॥ బలు
ట్లు। బలు
నెట్టిరియే
గు। తరు

చుజుట్టుదురుభృంగి॥కడు॥౨॥ మెండుగ చేతుల। కుండకోలలుబట్టి। యుండి రే మిసామి। యోరి।దుండగీడవారి।కుండుకమండల। దండములుభృంగీ॥కడు॥

వ॥అంతనమ్మహర్షులుయథావిధి శివదర్శనంబొనర్చి యుచితరత్న పీఠంబులనగూర్చున్ననభవుండును బహుమానంబుగాఁగుశలప్రశ్నంబుజే సి ప్రసంగవశంబున సర్వమంగళావివాహమంగళ కార్యసంగతిదెచ్చి యిక్కార్యంబునకుమీరు ఘటకులై నిర్వహింపవలయునని వివిధవచనరచన ల చతురిమనెఱపి మఱియునిట్లనియె.

ద్విపద.

ఘనులార మునులారకరుణాత్ములార-వినరయ్యయాలస్యవిధులుజా లించి*యగనేతసన్నిధికరుగఁగవలయు-తగుఫలాదులతోడదర్శింపవలయు మఱియుఁబెద్దలగూర్చిమాట్లాడవలయు-పొఱబోకకార్యంబుపొసగించవల యు*కార్యార్థినఃకుతోగర్వయన్నట్లు-నార్యకైయందఱననుసరణంబు* సేయంగవలయును స్త్రీలనుగూర్చి-నీయరుంధతితోడనేగగవలయు* వెండి బంగారముల్ వెలితిగావనుడు-కొండలకొలదిగాగూర్చెదమనుడు* యిల్లు చేపట్టినయింతికేనిత్తు- కల్ల గాదిక్కార్యఘటనమైనంత * వలనొప్పనటకుమీ వంటివారేగి-మెలతగూర్పకయున్నమీకెలాఘవము* తల్లిదంద్రులనన్నద మ్ములనెఱుగ-నెల్లచుట్టములుమీరే-

నంపు-చందంబులగ్ననిశ్చయ-

చి-జాలిదీర్పుడటన్నస-

ధా చేత్వదీక్షిత

నిర్వికారేశ*-

శర్వయని

రలవీడ్కో-

వ

త్యుద్ధానాభివందనంబులుగావించి నవరత్నఖచితసింహాసనా సీనులంగా
వించియిట్లనియె-

రాగం సారంగ - అటతాళం.

ఎంతోభాగ్యమునాకుమీరు।మా।యింటికివేంచేసినారు (అనువల్లవి)
కంతుజనకపదకమలభక్తులుమీపా। దాంతరజముమాయందుసోకినజాలు॥
నెంతోభాగ్య॥వారిజగర్భాదులైన।మిమ్ము।గోరినరారటుగాన। కూరిమి
తోపిచ్చిగుంటమీదభా।గీరథివచ్చినక్రియదోచేనిప్పుడు॥యెంతోభాగ్యము॥
౧॥ఘనమైనమేలుచేకూరు।మాకు।గాకున్నపెద్దాలురారు।మునుపటిమాపు
ణ్యములునేడుఫలియించె।మునిముఖ్యులారమిమ్మునబొగడగంటిని।యెంతో
భా॥౨॥కన్నాలకర్వదీరంగ।మిమ్ము।గనుగొంటిప్రేమమీరంగ। యన్నలా
రమీరలరుదెంచుకార్యాము। విన్నదాకచెవులువెతబడుచున్నవి॥ యెంతో
భాగ్యముమాకుమీరు।మాయింటికివేంచేసినారు.

ద్విపద.

అనినసంయములుబ్రంహ్మానందమంది-దనరినప్రేమభూధరనేతకని
రి*మారాకశుభమనిమన్ననతోడ-మీరుబల్కినపల్కుమిథ్యయేలగును* ఘ
నతరశుభకార్యఘటనకైవచ్చి-నినుగనుగొంటిమినిత్యకళ్యాణ * ధర్మసం
గ్రహుడౌసదాశి [illegible] నొసంగుకులశైలరాజ*చక్రదనం
[illegible] మువ్వారి*యననేమిటికిసమ
[illegible] * సర్వజ్ఞమూర్తివంశస్థితి
[illegible] సమస్తాంశములం
[illegible] దగునాత-డా
[illegible] చనింక- భా
[illegible] త్రి-నావు
[illegible] దర్పహారు
[illegible] టికిదగిలీ

యవలయు* నింతకన్నసుశుభ మేమున్నదయ్య - వింత లేదనిబహువిధముల బల్కె.

వ॥అంతకమున్నయరుంధతి శుద్ధాంతంబున కరిగి మేనకచేత సంభావితురాలై యిట్లనియె.

రాగంశంకరాభరణం - అటతాళం.

హరుడునీయల్లుడనయ్యెదననియున్నా। డరిదినీభాగ్యము మేనకా।పరమపాతివ్రత్యపావనిమీచిత్త।సరణిచొప్పగు నెయరుంధతీ॥౧॥ తరుణేందుమాళికి।తరుణేందునిటలకు।దగు నెసాంగత్యాము మేనకా।వరపుణ్యవతులుమీవంటివారిదయ।వచ్చినజాలునరుంధతి॥హరు॥ ౨॥ అరుదుగనీదంపతుల పెండ్లి జగదా।నందమా నెయో మేనకా।సిరులిచ్చు తావకా।శీర్వాద మెశుభ । కరమైయలరు నెయరుంధతి॥౩॥హరుడునీయల్లుడనయ్యెదనని.

వ॥అప్పుడప్పుడమిదాల్పుదొరబోట్టె యిట్టిటనరానిసొగసులుట్టి పడదండంబుబెట్టిన నరుంధతి బెట్టుతిగ ప్రోళ్లుగొట్టి నదిట్టచెట్టబట్టుమువనిదీవించి ముద్దులుమూటగట్టుగట్టు పట్టిం గౌగిటం బట్టితొడలపైగూర్చుండబెట్టుకొని చెక్కిలిముద్దుపెట్టికొని యెట్టకేలకిట్టులనియె నాచిట్టితల్లీనిన్నిప్పుడెగట్టి చేసుకొనవలె నీవమ్మహాదేవుపట్టంపుదేవివై కైలాసపట్టణంబున నున్నట్టివేళ మేమప్పట్టునకువచ్చిన సమధికప్రమథకర వేత్రంబులంబట్టికొట్టింతువో లేక నాటిపేదముత్తైదువ రారానిమ్మనికటాక్షింతువో తెల్పుమనిన యావనితలజ్జావనతానన తామరసయైశుకపోతంబులకు మేతయిడలేదనిలేచి సాచీకృతంబగు తెఱమఱుంగున కరుగునక్కరిగమనంగని మాయమ్మరమ్మురమ్మునాదినేరమ్ము నీవేలకటాక్షింపకుందువ క్షీణజగద్రక్షాదీక్షాసాక్షాల్లోకమాతవు కరుణోపేతవు మఱలనింకొకసారివచ్చి యుపగూహనంబిచ్చిపొమ్మనివేడ రాకపరాకైయుండ మేనకచిఱునగవుచేత కూతుబొమలనదలించి జగత్పావనియామెబిలిచిలినరాకుందురె యనునెడ

హిమవంతుండువచ్చి నిజకాంతతోమంతనంబునశుభవృత్తాంతంబంతయు చెప్పినసంతోషించి యప్పరమేశుతోఁదులదూఁగికల్యాణం బెట్లుగావించెదనోయనివిచారించి మంచిదిమనపాలిభక్తవత్సలుండగు పుండరీకాక్షునకుదయగలిగినతామే వేంచేసి మహోన్నతంబుగా మహోత్సవంబునడిపించుగాకేమనినిశ్చయించి పెండ్లికొడుకుందరలించుకొనిరమ్మనుమని యుచితసత్కారమ్ములనమ్మునుల వీడ్కొలిపిన.

ద్విపద

ఋషులేగితచ్ఛుభవృత్తాంతమంత- వృషతురంగునితోడవిన్నవించ
గనే*కడలేనిముదమందికైలాసనగరి- కడునలంకరణంబుగావించిమించి*
బ్రహ్మాదులనుబిల్వఁబంచిశంభుండు-బ్రహ్మాండపతియైనపద్మాక్షుబిల్వ*స
నకాదులకుగానిశక్యమెయనిన-సనకసనందనసంయములపుడె* చనుదెం
చినిలిచినసత్కృతిజేసి-వినయంబుతోజగద్విభుబిల్వనంపె* నప్పుడుమునివ
ర్యులత్యాదరమున-నుప్పరంబెగసిస్వయోగబలంబు * చెయ్యూతగామరు
త్సిద్ధసాధ్యాదు-లాయ్యనజోహారులొనరింపగొనుచు* ఘనమండలముజూ
చికంజాక్షుదివ్య-తనుతుల్యమిదియనితద్దయునలరి* నాకమ్ముగడచిమహాత
పోముఖ్య-లోకమ్ములునుసత్యలోకమ్ముదాటి*కమలాక్షునగరమ్ముగనుగొ
నలేక-శ్రమపడియద్దేవుచరణాంబుజములు* మానసంబుననిల్పిమాధవువే
డి-మానసింబ్రమ్మలప్పుడుమఱియునిట్లనిరి.

దండకము.

శ్రీమజ్జగద్రక్షణాక్షీణదాక్షిణ్య కందర్పకోట్యం చితాగణ్యతారుణ్యలావణ్యభోభో।రమాభూముఖాంభోజగంధిషట్పో। నఃప్రభో। కృష్ణనారాయణానంతగోవింద విష్ణోహరే।శ్రీధరే। త్వయ్యానఘ్యాత్మ మంజీరగానంతరత్నాంశుసాంగత్య నిత్యోల్లసత్పాదకంజాత సంజాతమారందబిందూభవద్గాంగనీరే। చిదానందసారే।స్వకీయోపరిభ్రాజమానోరుకాండానిశాధశ్చరన్నక్ర నిర్వక్రజంఘాశరధ్యుజ్జ్వలే। దైత్యాజిద్దోర్బలే।సన్మ

నోజ్ఞోరుకాండచ్ఛలోద్దండవేదండ శుండాభృతోద్యత్కటిత్స్మాతటీ సం
వలద్ధీర కాంచీపయస్సాగరోత్పన్ననాభీశుభావర్తభాగోత్పతద్బిందుబృం
దాయమానాననాఖ్యారవిందారి సేవాసమాయాతనక్షత్ర జాలోజ్జ్వ
లత్తారహారే। సమస్తాగమాంతాద్రిఖేలన్మయూరే।రమాకోమలాంగీదృ
ఢాలింగనప్రక్రియాముద్రితోరోజకాశ్మీరపంకాంకశంకాంకురేణ స్ఫుర
న్నాభికాకోటరోద్యచ్చతుర్బాహుశాఖాంగులీ పల్లవాళీనఖానూనసూ
నోల్లసత్త్రాయకల్పప్రసూనాంచత్ఫలాకారధుర్యేణ చిత్రాబ్జగాగణ్య కారు
ణ్యకాంతిప్రకాశేన వక్షస్స్థలీబింబితాత్మా ధరోద్ధభ్రమాపాదినాకౌస్తు
భాఖ్యాకమాణిక్యరాజేన దేదీప్యమానే। కనన్నాభిగాజాంగభారూపసౌ
వర్ణవాసోసమానే। పయోజాలయాబాలికాకేళికాడోలికాప్రోల్లసద్వై
జయంతీలతామాలికే। బాలచంద్రాలికే। నిత్యమూర్తే భవన్నైజకీర్తిప్ర
తాపస్ఫురచ్ఛంఖచక్రాపదేశాతతానేకలోకావళీరాత్ర్యహః కార్యవి
జ్ఞాపనాయాతచంద్రార్కభార్గోన్మిషత్పద్మమాల్యాంచితే। శాంబరీముంచి
తే।దంతివిద్వేషకృద్గ్రాహసాక్రమాచ్ఛిరఃఖండనానంతరాత్యంతసంపోషి
తేభౌమృతౌ ఘూర్ణతన్నక్రపోతాకృతోపేతలీలాహరిద్రత్న వత్కుండ
లాఖండలావణ్యభాగ్గండభాగే। సదాపూర్ణభోగే। ముఖోద్భాతసుశ్వేత
మృత్స్నాకృతిచ్ఛిద్రభద్రోర్ధ్వపుండ్రప్రభాపుష్పశయ్యాంతరోదీర్ణకా
శ్మీరచూర్ణాతి బాలత్వసూత్మాగ్నిరేఖావిరాజల్లలాటే। పతన్నేత్రఘో
టే।నితాంతాబ్జమిత్రాకృతిప్రోల్లసల్లోచనే। పాపనిర్మోచనే। మానిచిత్తో
త్పలానందకృద్దీనపాళీచకోరప్రియప్రాజ్యమందస్మితోదారదృక్చంద్రి
కాసాంద్రవక్త్రేందుబింబే। మనోజ్ఞోష్ఠబింబే। మహాకోటిసూర్యోజ్జ్వల
త్కోటిమాణిక్యకోటీర రారాజమానోత్తమాంగే। పయోభృన్నిభాంగే
మనోనోవినోదేనఖేలత్త్వహాసాసత్త్వమూర్తే।శరచ్చంద్రకీర్తే। భవ
న్నామసంసారదుర్వారవారాంనిధే। రన్నఘనోదార్యగాంభీర్యధైర్యా
వధే। సత్యసంకల్పయుష్మద్గుణానాంస్తుతేరాః కియంతోవయంతోయజా

తాక్షమానక్షమాదక్షజేతాప్యదక్షోవిధిర్నావధీశక్తిహీనోప్యహీనఃభ
వాకారణంకారణానాం పరంమంగళంమంగళానాం పరస్మాత్పరోస్మాక
మద్యత్వమద్యత్పదద్వంద్వ సేవాంముదా దేహినః పాహితుభ్యన్నమస్తే
నమస్తేనమస్తేనమః.

వ॥అనియ నేకగతులనుతు లొనరించునమ్మునిపతులకతుల కృపావి
లాసుండగు శ్రీనివాసుండు ముముక్షుజనాపేక్షితంబగు నిజపురాధ్యక్షుం
బుతోనక్షణంబున సాక్షాత్కరించినవారని వారితాశ్చర్యచర్యాతరంగి
తానందపారావారంబునందేలి తన్మహాపురసరణినరుగు నవసరంబున
నుపనిషన్మయంబులును దివ్యతేజఃపుంజంబులునగు నమ్మేడలవాడల వా
యించక నేతమకుదామేదామోదర నామధ్వనులుతాళౌను గుణంబుగా
మ్రోయుశంఖభేరీమృదంగపటహఢక్క వేణువీణాదులంజూచి యరుదం
దుచు ననంతవేదాంతవాక్సంతానంబుల నయ్యనంతమూర్తియనంతక
ల్యాణగుణంబులుపన్యసించు శుకపికశారికాపారావతనీలకంఠ జాలకం
ఠనాదంబులకు వినోదంబునొందుచు మఱియునెందుజూచిన నందఱునతి
సుందరులును చిదానందభరితులును శంఖచక్రాదిలక్షణలక్షితులును పీ
తాంబరకలితులునగు నమ్మహాపురుషులసందర్శించి ముకుందతుల్యులనివం
దనంబులొనరించుచు జనిచనియవల నవాఙ్మానసగోచరంబగు తదీయ
మాహాత్మ్యంబునకు చిత్రవిచిత్రంబునొందుచు నిజమణికాంతిసంతానా
ధఃకృతజగద్వారంబగురమాకాంతాతఃపురద్వారంబుచేరంజని తత్ప్రాం
తంబులవెన్నునిసన్నిధి తమతమమనవులు విన్నపంబుసేయుకొఱకు స్వా
మిభృత్యులంబతిమాలు బ్రహ్మాదులంజూచుచు ననిరుద్ధానుగ్రహంబునం
జేసిదౌవారికులవలననిరుద్ధులై సమిద్ధసహస్రకోటిమణిస్తంభ బద్ధశు
ద్ధాంతభవనంబులుగడచి యుద్దామతేజోలేశంబువలన జంద్రసూర్యా
గ్నినక్షత్రాదికంబులు తేజోయుక్తంబులై వెలుంగునట్టిదివ్యసౌధంబుబొ
డగని యందునందందనంద సునందగరుడ విష్వక్సేనాదిముకుంద భక్తుల
సందర్శింపుచు తన్నిర్దిష్టసూత్నరత్నసోపానవితానమార్గంబున నత్యు

న్నతవిశాలోపరితలంబున కెక్కినచ్చట ననర్ఘ్యమణిసింహాసనంబున వి స్తీర్ణబహుమృదుతరాస్తీర్ణంబునసహస్రఫణామణిప్రభాభాసితానంత భోగిభోగంబున సజలజలదవిగ్రహుండును కటాక్షలక్షితభక్తానుగ్ర హుండును మహామహోన్నతమకుట మకరకుండలమౌక్తికహారమణి కేయూరకంకణ కాంచికాకటకకలితుండును కనకాంబరభాసితుండును నై యనేకదివ్యాప్సరజనంబులూడిగంబులుసేయ శ్రీభూనీలాదేవులు ప రివేష్టించికొలువ చెలువమరుశ్రీమన్నారాయణస్వామిని దిలకించిపుల కించి యానందబాష్పంబులుచిలికించి తదీయచరణకమలంబులకు సాష్టాం గదండప్రణామంబులొనరించి యొక్కింతదడవునకులేచి కరపుటంబుఫా లతటంబున నిడియిట్లనిరి.

సీ॥ శ్రీమనోనాథాయజితదైత్యయూథాయ బలసనాథాయతుభ్యం నమోస్తు। కాంచనచేలాయకారుణ్యశీలాయభక్తపాలాయతుభ్యంనమో స్తు। జితఘనదేహాయహతమదమోహాయపతగవాహాయతుభ్యంనమోస్తు త్రిజగద్వరేణ్యాయదీనశరణ్యాయపరమపుణ్యాయతుభ్యంనమోస్తు। పన్న గేశశయాయతుభ్యంనమోస్తు।పన్నమన్నిగ్జరేంద్రతుభ్యంనమోస్తు। స న్నుతాపన్నవరదతుభ్యన్నమోస్తు। సన్నికరసుప్రసన్నతుభ్యన్నమోస్తు

శ్లో॥ జయాంబుధిజయాయుక్తజయమృత్యుంజయప్రియ। జయసత్య జయోపేతజయాధోక్షజయాగప॥

శ్లో॥ జయకృష్ణజయానంతజయాచ్యుతజయావ్యయ। జయవిష్ణోజయ శ్రీశజయరామమహాప్రభో॥

చూర్ణిక.

జయజయజయవిజయకరపుటీతటీపటీయోవేత్రనటీ రంగాయమా నసురపుంగవమకుట। మహామహాప్రకట।జయజయాఖిలజగజ్జాలరక్షాదక్ష దీక్షకటాక్షవీక్షణ।నిరుపమితశుభలక్షణ।జయజయాంభోధికుమారీకుంజరీ కుంభభర్మరీ జృంభత్కుచకుంభయుగీమృగమదపంకాంకామ్రేడితాసితవి

భావిభాసితశరీర। మహామహిమోదార। జయజయాఖండపుండరీకభవాం
డపరిపూర్ణోదర। దీనజనఘనాదర। కింకుర్వాణగీర్వాణేశశర్వాణీప్రాణేశ
వాణీశ। రమారమణీశ। వంచితాసురప్రపంచ సమంచితపాంచజన్యసుదర్శ
న కౌమోదకీశార్ఙ్గాదిపంచాయుధవహ బాహాద్వయద్వంద్వ। నిర్ద్వంద్వ।
వశిష్ఠవామదేవ వాల్మీకివాలఖిల్యాదివాచంయమీవారవందితసుందరచర
ణారవింద। ముకుంద। పరమానందగోవిందదామోదరరామమాధవవామ
ననారాయణేతి చపలమతిననన్యగతి సద్గుణతతినఖిలాక్షువ్యసనరతిసంజ
సాసమంజసకరుణారసపుంజరంజితకటాక్షేక్షు। కమలాక్షు। జగన్నాటక
వినోద। నః ప్రసీద। నోంతరరివర్గాన్విదారయ। గ్రాహగ్రస్త స్తంబేరమా
పాలనాతివేలరయ। దుఃఖసాగరాదుద్ధరోద్ధర। శ్రీధర। పాహిపాహికృ
పాహితే। గుణస్సురూపాహితే। హితరతిమయానమోభవంతే। ఓన్న
మోభగవతే శ్రీకృష్ణాయ। పరిహృతతృష్ణాయ। విష్ణవే జిష్ణవే మధుసూదనా
య। రిపుభేదనాయ। గరుడవాహనాయ జగన్మోహనాయా వ్యయాయా
చ్యుతానంతకోటి బ్రహ్మాండనాయకాయ। ఫలదాయకాయ। జగత్సృష్టి
స్థిత్యంత కారణేజగత్కారణాయ పాపహరణాయపాలితవారణాయ య
ఘౌఘమర్దనాయ ఘనశ్యామలాయ। కోమలాయ శ్రీనివాసాయ వైకుంఠ
వాసాయజగత్కర్త్రే। నమస్తుభ్యమభ్యంచితకౌస్తుభాద్యాభరణభూషితా
య। రమాతోషితాయ। కనకాంబరాయనుతాంబరాంబరాయ। నమస్తే
నమస్తేనమస్తేనమః

ద్విపద.

అనినుతియించినయంమానివరుల- ఘనకృపామృతరసకలితంబులైన
కన్నుదామరలజక్క-గజూచిమోము -పున్నమజాబిల్లిబోడమినచిన్న* వె
న్నెలవలెనవ్వువిలసిల్లమిగుల-మన్ననతోడుతమాటమాటకును* తేనెలుట్టి
పడనద్దేవుడిట్లనియె-మానీంద్రులారమామకసన్నిధికిని* మీరువచ్చినపని మే
మెఱుంగుదుము-గౌరీరమణ్యాత్మకల్యాణమునకు* మముబిల్వబంపెనావు

జదనుజారి-క్రమమట్లనైననికౕ-ముగౌరియందు* నతిశయకృపగల్గినందున శైల-పతిపక్షముగవత్తుపరిణయమునకు* నేరీతితమ పెండ్లి కేరాక గాదె- మీరు బ్రంహేంద్రాదిమిళితులై వెండి*కొండకుజనుడనిగోవిందుడనిన - పుండరీకదళాక్షుభువనైకరక్షు*జలజపాదములకుసాగిలి మ్రొక్కి - సెలవుపుచ్చుకుమునిశ్రేష్ఠుల వ్వేళ * బ్రంహేంద్రముఖ్యాదిక్పతులనుగూడి - జిష్ణు గభూపాద్రిసీమకుజనిరి.

వ॥ అంతపురాంతకుండంతయువిని యత్యంతసంతోషితస్వాంతుండై బ్రంహేంద్రాదులను ఉచిత సత్కారసంతుష్టులంజేసి తనదునెచ్చెలియైన ధనదుతోనభీష్టప్రాప్తిరూపప్రీతిసముచ్చయంబులగు ముచ్చటలాడుచు నొక్కసుముహూర్తదినంబున భేరికా భూరికాహళరంగన్మృదంగవేణువీణాదినిస్వనంబులు జెలంగ రంభాదినటీనాట్యంబులలరంగ వందిమాగధవారంబులనైకవారంబులుమీరంగ వశిష్ఠాదిమునిజనాశీర్వాదంబులువోసంగ యనేకత్రిలోకవాసులంగూడి పరిణయోత్సవంబునకు హిమగిరికరుగునపుడు.

సీ॥ మెఱుగుదీగెలకన్న మేల్గన్నపటుజటాపటలంబు నెఱిజరీపాగగాఁగ। చెలువైనకళలీనగలచిన్ని నెలకూన పృథులవజ్రపుసరిఫేషుగాఁగ। నలరారుసికతీరుగలుగుబల్మిన్నేరుబొండుమల్లెలపువ్వుదండగాఁగ। మిసిమిజేతజెలంగుభసితంపులేబూత రంగైనసన్నపుటంగిగాఁగ। లేలిహానఫణాళితాళీలుగాఁగ। మేలుపులితోలుపైవన్నెశాలుగాఁగ। సొగసుసెగకన్నుకుంకుమచుక్కగాఁగ। వృషహయము నెక్కి పెండ్లికివెడలెశివుఁడు॥

చ॥ హరుడరుదెంచువార్తవినియాహిమవంతుడునంతమేరువుం। దరముఖబంధులంబిలిచితామరసాక్షుడురాకయున్ననీ। పరిణయమోదమేమనుచుభావనసేయముకుందుడీశ్వరే। శ్వరుడుకృపాతిరేకవిలసన్మతితోడప్రయాణవహాతజీ॥

క॥ శ్రీలానీలాదేవులు। హేలాగతితోడ వెంట నే తెంచుటకై। చాలావే
డినహరిమీ। రేలావలదనియెమర్మమీయక యంతన్॥

వ॥అప్పుడప్పలుకులువిని కలిమియొప్పులకుప్ప వెతముప్పిరిగొన్నమూ
ర్ఛనంగప్పిసోలి తెప్పిరిలి రెప్ప లెత్తిచూచియప్పరమపురుషునకిట్లనియె.

రాగం కేదారగౌళ - అటతాళం.

ననువిడనాడనాయమానా ( అనుపల్లవి ) ఘనుడానా సామీకనికర
ముమానిన॥నునువి॥యెన్నడైనని న్నెడబాసితినా। కన్నాడ సేయుటకు కారణ
మేమీ। వెన్నాడనా సేయువిన్నపమాలించి । మన్ననతో నేలు మానీకు
మొక్కేను॥ననువిడనాడ॥

వ॥అనినమనసుగరంగిమాధవుండిట్లనియె.

రాగంసురట - త్రిపుట.

కలనైనానినుబాయగలనాయోలలనా ( అనుపల్లవి ) లలనరా వేమ
దికలకమాని వేగ॥కల॥ అలికుల వేణి।కలపిక వాణి। జలరుహపాణినా। వలన
నేరమున్నది॥కల॥౧॥చక్కెరబొమ్మా। చక్కనికొమ్మా। ముక్కెరవరమ్మానే।
మరులుగొన్నవాఁడా॥కల॥౨॥చిలుకలకొలికి। చిత్తజుములికి। కులుకుచుబలికి
నా। కోర్కెదీర్చుమిపుడు॥కలనైనా.

వ॥అంతధరాకాంత కుపితస్వాంతయై కేళికాగార తల్పంబువదలి
యొక్కకాంతనిశాకాంత వితర్ధికాంతరంబున నుత్తరీయంబు పర్యంకం
బుగాబవ్వళించి వగచుచున్నవెన్నుండువచ్చి చెంతగూర్చుండి పార్శ్వ
భాగంబంగుళీయోగంబు జేసిన నవ్వకయవ్వెలందిచేవిదలించి ముసుంగి
డినబలిమిముసుంగు వలువదొలంగించి చుబుకంబునివురుచునిట్లనియె.

శ్లో॥వదనేవ్యగంతమదనేవహాస్మితంసదనేవ సాంశుమదనేకతల్పకే।
రుదనేహసుందరదనేమమప్రియం।వదనేత్రకాంతపదనేత్రపంకజే॥

ఉ॥నావినిపల్కెబంటచెలినన్నిటులేదురిదాన జేసినీ। వీవగలీవి నోద

గతు లేటికిఁ జూపెదు తేటయయ్యెనీ । భావమునీమ ప్రాణసఖి పజ్జకు నేఁగుము కోపగించుల। క్ష్మీవర చాలుఁ జాలునను జేరకు లెమ్మనినించె బాష్పముల్ ॥

మ॥ అనినన్నవ్వుచుఁ గౌఁగిలించుకొని బాలా చింతనీ కేల నే। నిను బాయం గలనా యటంచు దయకన్నీరొత్తి మోమెత్తిచి। క్కనికొప్పొప్పఁగ దీర్చి హారములు చక్కంగూర్చి యూరార్చి ర। మ్మని సమ్మోదము నంద జేసె నపుడయ్యాపన్నబంధుండిలన్ ॥

వ॥ అంత నీలానీలాళినీలాలక కేళీసౌధద్వారంబుననుండి చిఱచిఱలాడుచు చుఱచుఱం జూచుచున్నం గని వెన్నుండు వెఱపింపఁబోయి వెఱచినట్లుండె యింక నీకొమ్మ సమ్మతిపఱిచి దో తేరవలయునని కొమ్మా నీకోసమ్ము వచ్చితి రమ్మనిన పలుకక చిలుకలకొలికి యలుకం దలుపు చిట్టెల్లున వైచి యిట్లనియె.

శ్లో॥ జవతోద్యగచ్ఛ భవతో హితప్రియామహితాస్వహం యదహితాభవత్యపి। మయి తే కృపామదయి తేయమిత్యలం। నవదానృతం తుమవదాతకీర్తిమాన్ ॥

వ॥ అనిన నక్కపటనాటకసూత్రధారుండిట్లనియె

సీ॥ అలుక జాలించవే పలుకు జెల్లించవే తలుపు దీయించవే తలిరుబోఁడి యకట నీవాఁడ నే యనృతంబులాడ నే పరుల నే వేడ నే తరళనయన। మాటాడ రాదటే మది ప్రేమ లేదటే మెదజాలి గాదటే యిందువదన। యెందాక కోపమే యిదియేమి పాపమే యింత కేమోపమే దంతిగమన। గడియ యుగమయ్యె దీయవే గడియ పడఁతి। జాగు సేయకు బంగారు తీగె కాన। చలముదగునటె చిలుకలకొలికి నీకు। వేళమించెను రాగదే బాలనీల॥

క॥ వలముఱిదాలుపుదోరయా। వలబిలువగనీలవలదు వలదని పెనఁగన్ । జెలికత్తె గదిమి నీకిటు। వలెగూడదటంచు తలుపు వడిగాదీసెన్ ॥

శా॥ ఆ వేళన్ హరి నీలనీలకచ నెయ్యం డాసి బాలామణీ। రావే బాలకురంగలోలనయనా రావే మనోహారిణీ । రావే యంచుఁ గరంబునన్మదకరీం

ద్రుంబాత్మపూజార్థమై। పూవుందండయుబోలిమొత్తికొనియెఁబోటుల్,
ముదంబందగన్॥

ఇప్పగిదిముగురుమగువలనగణితానందంబునొందించియజ్ఞగదీశ్వరుండు.

సీ॥ శ్రీవత్సకౌస్తుభశ్రీవైజయంతియుగురముతోఁ సకిరీటశిరముతోడ। మకరకుండలవిభామండితనిజగండతటముతోఁ సౌవర్ణపటముతోడ। శంఖచక్రగదాసిశార్ఙ్గయుక్కరయుగ్మయుగముతోఁ జిఱునవ్వుమొగముతోడ। బహుతరబ్రహ్మాండభాండపూరితమైనబొజ్జతోఁ బాఁపరాసెజ్జతోడ।నక్కమలయక్షునెక్కితళుక్కుమనగ।వసుమతీనీలలుభయపార్శ్వముల మెఱయ।గరుడహాయమెక్కిహిమగిరికడకుదరలె।దాసులకుకల్పకమువంటితమ్మికంటి।

ఉ॥మించులతేటమించునవమేచకమేఘముబూనివచ్చుబాగ్భాంచనశైలమోయనఁగఁగాంచనగంధులచెంతనుంచున। కాంచనచేలుదాలిచినగంబులురెక్కలగాలిపాంసురే। ఖాంచితలీలగాంచవిహగాగ్రణిద్రాలెహిమాద్రిపైవెసన్॥

గీ॥అఖలయాజాండభాండములుకుక్షిఁదాల్చు।విశ్వమయుదాల్చెవీఫునవినతకొడుకు। వినతకొడుకునుహరినిదాల్చెనుహిమాద్రి।స్వామికృపగల్గనెంతైనశక్తిగలదు॥

ద్విపద.

అగనేతయటజాతహర్షంబుచేత- మగరాతిజగజంపుమకుటంబువాని
మొలకనవ్వులవానిముద్దులుగారు - తళుకుచెక్కులవానితమ్మిపూవన్నె*క
న్నజెన్నగుసోగకన్నులవాని-క్రొన్నెలతోఁబుట్టుక్రొంజిగిసొగసు*కళలు
గుల్కెడుమానికపుతాళివాని-వలిపెబంగరువల్వవలెవాటువాని* నామర
ధునిగన్నయడుగులవాని- చామనిచాయమైచకచకవాని * గొలిచినవారికి
కొంగుబంగారు. తలచినవారికితంగేటిజున్ను * పిలిచినవారికిపెరటికల్పక
ము-కొలదిమీఱినమంచిగుణములప్రోవు*నారాయణస్వామినతచిత్తగామి
కారుణ్యమయమూర్తికమలానువర్తి* పరమాత్మహరిపరాత్పరునినసంత-

గరుడవిష్వక్సేనఘనభక్తసేవ్య*గనుగొనివినయంబుగదురదత్పాద - వన
జాతయుగళిపైవ్రాలిపహర్షాశ్రు* జలములు చిలికించిసులలితప్రేమ - దొల
కించపులకించితోయజాక్షుండు*లేవనెత్తగభక్తిలేచియిట్లనియె - దేవరల
రుదెంచితిరిగానతొల్లి*నేజేయుపుణ్యముల్ నేడుఫలించె- నాజన్మమఖిలవ
ర్ణనకెక్కెనయ్య*నాభాగ్యమేమందుననుగన్నతండ్రి - నీభక్తసులభతనీ
మహత్వంబు*నేనెంతవాడవర్ణించగానేర-దీనపోషకసర్వదేవతారాజ
పతివిపిపీలికాబ్రహ్మపర్యంత-మతులితకృపయొక్కటౌగాదెమీకు * నాపె
న్నిధానమనాముద్దులయ్య-చేపట్టితివిదయజెందముకుంద*శ్రీకృష్ణగోవిం
దచిన్మయానంద- నాకోర్కెలీడేరెనన్నేలినయ్య * పాదసంభవగంగపా
ద్యమేమిత్తు- నాదరానర్ఘ్యాత్మయర్ఘ్యమేమిత్తు*ననుచుమాణిక్యసింహాసనం
బిచ్చి- తనబోటితోఁబూజదనరగావించి * తనయనుమ్రొక్కించిదయమీర
దీని-నీబిడ్డగతిజూడునిఖిలేశయనిన*నాబాలదీవించియచ్యుతుడనియె - గంగ
వావినికూతుగాదగునీవ*రాంగనన్నైననేననుజగాజూతు- ననుచునమ్మేనా
హిమాద్రిపార్వతుల-ననితరలభ్యదయాదృష్టిజూచె.

సీ॥ బ్రహ్మాదులకుగానబడనివాఁడేతెంచెనగనేతభాగ్యమేమనెడువా
రు। నీభక్తసులభతయిటింతయనగరాదనుచునత్యాశ్చర్యమందువారు । నీ
దేవదేవునిపాదముల్గనుగొంటిమహామహాపుణ్యమేమనెడువారు। స్వా
మివేంచేసెనీశైలజకల్యాణమఖిలలోకోత్సవంబనెడువారు । నగుచుజన
ములుఘనవక్షునంబుజాక్షు।గనకమయచేలుమునిలోలువినుతశీలు। మనసి
జాయుతశతరూపుమథితపాపు।గనిరిమనసారకన్నులకఱ్వదీర॥

వ॥ అంతననంతశయనానంతతను కాంతిసంతానంబున హిమవం
తుపురంబాద్యంతంబంతయు నల్లగలువతోరణంబుల గస్తూరికాలేపనంబు
ల నీలంపుమిన్నాపనుల శృంగారించినట్లు శృంగారరసాక్రాంతంబైయుం
డ మఱియుహిమగిరియుపన్నీరధారాసేచనకసేచనంబులఁబ్రోల్ల సన్మా
ర్తికరంగవల్లికలనగణితమణిదీపకలాపంబుల నతివిచిత్రచిత్రంబులగల్యా
ణహేతుకేతువుల సమస్తసౌధంబులలంకరింపించె నటుపశుపతికతిపయప్ర

యాణంబుల హిమగిరిపురిదరికి నభిమతశుభమహావిభవంబునవచ్చి య
చ్చేరువమృదుపవనంబగు తదుపవనంబునందిగి జగతీసురయుగళంబువృత్తాం
చిన వారనివారితానందపూరితులై పెండ్లివారిచ్చోఁజేన్నారు మీయా
రామంబునడిగి యున్నారనివిన్నవించిన నాయగనేతబాయగరానివేడ్క-
సకలసౌరభ్యనిలయమలయ ఘనమహిమావంధ్యవింధ్య సద్గుణరత్నసుం
దర మేరుమందర ముఖబంధుబంధురుండై విహంగపుంగవతురంగగామియ
గు శ్రీమన్నారాయణస్వామినిముందరనిడుకొని జయవిజయనందసునం
దాదులంగలసి సుకుంపుముందరమైనాక కోలాహలులు వేత్రహస్తులై
యుభయపార్శ్వంబుల బరాబరులు సేయనియమించి సుందరమణితుంది
లంబులగు నందలంబులనందంబులం జెందు శ్రీభూనీలాదేవులంగొల్చి మే
నకాదిశుద్ధాంతకాంతాసంతానంబనేకపురసువాసినీ జనంబులతో నేతేర
నియోగించి గంధగజవ్రజంబులంతశ్శైలజాలంబులుగా సముత్తుంగతు
రంగంబులుతరంగంబులుగా దివ్యరత్నస్యందనబృందంబులు మణిద్వీపం
బులుగా సముల్లసితంబులగు పల్లకీలుకీలువాడలుగా మదాతిరేకపదాతిస
ముదయంబుమచ్ఛకచ్ఛపగ్రాహవ్యూహంబులననుకరింప నపారవారాం
గనావారంబులు జాయమానాప్సరోమానవతులుగా గంభీరభేరీమృదంగ
కాహళవేణువీణాదిరవంబులు నానాగంధర్వగానంబులుమేదినీ సురాశీ
ర్వాదనాదంబులు వందిమాగధవారంబులకైవారంబులు సైన్యకలకలం
బులంగలసి మహాంబుఘోషంబుగా పాలసముద్రంబచ్యుతసహితంబు
గాదరలివచ్చినట్లుండె సాయంసమయమాట నవ్వారిగానివ్వటిలు దివ్వి
టీలు చంద్రజ్యోతులుపీతాంబరనేత్ర మిత్రనిశాకాంతాకాంతులంబోలి
చెలువార నుదారంబులగుబారాజివ్వాలు తారాపథంబునకెగసి యచ్చ
టచిటిలియ నేకస్వచ్ఛగుచ్ఛంబులై మరలి తదుత్సవేక్షణంబునకు నక్షత్ర
గణంబులదోడ్తోనివచ్చి నట్లమెఱయ మఱియుగొన్ని సర్పాకారంబులై
చంద్రజ్యోతులను బహుచంద్రబింబంబులుగాదలంచి విధుంతుదుండుద
న పుత్రపౌత్రబంధుమిత్రపరివారంబుగూర్చికొని క్రోధాగ్నిజ్వాలలతో

వచ్చి వహ్నిమయచక్రంబులంగని సవిస్ఫులింగంబులగు చక్రిచక్రంబు లుగాఁదలంచి యంతర్హితంబులయ్యెనో యననడంగ మాటిమాటికినీట మునుంగుచుఁదేలుచు నేటుగసుదురుసులగు నీటిబిరుసులరూపంబున యః ఋండుదనకృపీట జన్మతఁదేటపఱుప మఱియునకలంకంబులగు లంకాపురు లుదిక్కాంతలు నివ్వాళిద్రిప్పినచొప్పున నొప్పుచుండె నుభయపక్షంబులుగ లసిప్రత్యుద్ధానాభివందనాలింగనాద్యుచితసత్కారంబులుగావించి పన్ని రపటీర గంధసారపటవాసాదిపరిమళ వస్తువిస్తారంబు నెఱపి కస్తూరికా దిసువస్తుకదంబంబులంగదంబించినగంబురాతాంబూలంబులం జాంబూన దాంబరంబులంబరితుష్టులైకొంతదడవచ్చటయచ్చరలయాటపాటలకు మెచ్చి లేచి పెండ్లికొడుకునుముందరనిడుకొనిముకుందునాజ్ఞా క్రమంబునమ గుడిపురికినడుచునప్పటి సందడిచూపరవినోదపరతఁ గొందఱౌరమహా ద వారణఘటల య్యారెయొయ్యారంబులగు గుఱ్ఱాలఫౌఁజు లాహో రథవ్యూహాతిశయంబులని యుభయవిభవంబులకరుదందువారును గొందఱివికప్పురంపుదిప్పలివియత్తరువుచెరువులివి పన్నీరుమున్నీరులివి దుగ్ధమ మలయజకర్దమంబిచ్చటజాను దఘ్నంబిచ్చటకటి దఘ్నంబిచ్చటకంఠద ఘ్నంబని వెఱగందువారును గొందఱుకాముకులుసుందరీ తనుస్పర్శనంబు కొఱకు ముందువారాంగనామధ్యంబుననుండి యంతకంతకుసందడిబలు వైనతన్మధురాధరపయోధర ధరాధరంబులంజిక్కి క్రిక్కిరిసి యుక్కిరిబి క్కిరియైధరణింగాళ్లందక పక్కిజక్కి నెక్కుసామి పాదంబులకు మ్రొక్కి తదీయసప్యక్కరుణాయుక్కలితదృక్కలాపంబున బయలెక్కువారును కొందఱుచెట్లుగట్లుశైలంబులు సాలంబులెక్కితదేక తానతమహోత్స వంబీక్షించువారును నగునప్పుడప్పుండరీకాక్షుం డింద్రచంద్రజయంతవ సంత నలకూబరమైనాకకోలాహలాదుల మఱియుగంధర్వవరుల నంత రాంతరంబుల నమరనమరకమలాస్యాలాస్యాతిశయ సారస్యంబులనడ పించుచు నడువకట్టడిజేయించి విరించిహేమాచలసనకసనందనవశిష్ఠాదు లతోనల్లనల్లనపెండ్లికొడుకుం దోడ్కొని పౌరనీలాలకాజాలకంబులు సా

ధజాలకంబులనుండి ముక్తాతుతకుసుమజాలకంబులు జల్లగాఁజల్లగానడుచుచు హిమవంతునంతఃపురంబుదరియంజనిశుంభద్రంభా స్తంభయుగళశాతకుంభకుంభయుగళీబంధురమణిద్వారబంధంబు రాజముఖీకరరాజితమణినీరాజననీరాజితుండై చెలువారు పెండ్లికుమారు దక్షిణపాదంబుమున్నిడునట్టుగాదాటింపించి నూత్నరత్నదుర్నిరీక్ష్యానంతకక్ష్యాంతరంబులునిర్వర్తించి వైవాహికలక్షణకారణ మకరతోరణశుభాసక్తముక్తావితాన వితానమంగళతరరంగవల్లికాప్రోల్లసద్వేదికా చిత్రవిచిత్రసుందరంబగు వివాహమందిరంబుఁబ్రవేశించి యప్రతిబింబచిత్రకంబళాస్తీర్ణశోభితంబును ననేకయోజనాయతంబును నై యొప్పునప్పరిణయశాలయందు నమ్ముకుందుండనర్ఘ్యసింహాసనంబునంగూర్చుండి త్రిలోకజనంబులనుచితస్థలంబుల గూర్చుండనియోగించి యాటపాటలవినోదంబువీక్షించునంత.

ఉ॥ క్రొమ్ముడివీడహారములుగుబ్బలఁబాతరలాడమధ్యభా। గమ్ముజెలింపనూరుపులుగాఢతరంబుగముంపజెక్కుల। న్జెమ్మటజెందఁగంకణమణిక్వణనంబిరవొందవేలుపుం। గొమ్మయొకర్తుశంకరునకుఁ దలయంటెననేకభంగులన్॥

క॥ లలనలుశివునకుగంధా।ములకంబిడిజలకమార్చిమడుగిచ్చిసుభూ।షలలంకరించిశోభన।తిలకంబిడికజ్జలంబుదీర్చియంతన్॥

సీ॥ తలయంటెనీలకుంతలకువింతగనొకర్తు జలజలోచనకొకర్తుజలకమార్చెఁదడియొత్తెమేనఁబుత్తడిబొమ్మకొక్కొర్తుచెలువంపుమడుగిచ్చెచెలువకొకర్తు।మణిభూషలంగనామణికికూర్చెనొకర్తుకలికిబొట్టిడెముద్దుకలికొకర్తు। పుష్పాలుశికజుట్టెఁబువ్వుబోఁడికొకర్తుశివుచెంతగూర్చెనాశివనొకర్తు। చికిలిజేసిజలముచేదోలంచిపటంబు। నెత్తిమానికములయొరఘటించిపొసగఁగుంకుమమునఫూలబూజించిను। మాస్త్రీకూర్చెమోహనాస్త్రిమనఁగ॥

గీ॥ గుభులుగుభులని దేవదుందుభులు మ్రోసె। కూడిగంధర్వకిన్నరు ల్యాడిరాడి। రచ్చరలుపూలుగురిపించిరమరవర్యు। లచటివారెల్లనతిచిత్ర మందిచూడ॥

ద్విపద

ఆవేళ వాసుదేవాజ్ఞచే బ్రహ్మ-దేవుడాచార్యుడై దేవతావరులు* సనకాదియోగులుసప్తర్షి ముఖ్య-మునులునరుంధతీముఖ్య భామినులు* కన్నులపండువుగాజూచుచుండ- పమ్మ గానంకురార్పణముగావించి * ఫలదానములుద్విజప్రతతికామోద- మొలయనిప్పించి వేదోక్తమార్గమ్ము * వరలజేయుచువధూవరులమధ్యమున- తెరవైచెసిగ్గను తెరచేతమున్న*నోరజూపులజూచునువిదకువచ్చె- వేరొక్క తెరయని వెలదులునవ్వ* నంతవధూవరాభ్యాంవరదాభ-వంతనికుర్వంతు వాంమంగళమ్మ*టంచుభూసురులులగ్నాష్టకముల్ ప-ఠించగా తెలియె త్తిరీవిసంతోష * శరనిధి తెరయెత్తెసతికీశునకును-మరుడప్పుడిరువురమర్మంబులేసె* వారిచూపులెశరవారముల్ జేసి-వైరంబుజనదెంతవారికినైన.

వ॥ భేరీలుభూరాలునీరంధ్రముగా భోరుకొలగి వడిచెలంగి వెలెంగెనటమజేయుఁ.

ద్విపద.

హిమవంతుడంతటనింతియుదాను-గమనీయగుణదొడ్డగారాపుబిడ్డ* చెలగిప్రత్యక్షలక్ష్మీపూజజేసి - కొలువున్నముద్దులగుమ్మ లేగొమ్మ * యలఘులజ్జాభరంబధికమైయుండ-దలవంచికొనియున్నతనచిన్నిగౌరి* ముందరనిడికొనిముక్కంటియడుగు-లందంపుబల్లెరంబందునగడిగి* సాలంకృతముగకన్యాదానమిచ్చె-నీలకంఠుండుపాణిగ్రహణంబు*గావించెనించువిల్లాఁడుఝళ్లించు- మావిలేజిగురుజొంపపుతరవారు * దొరికించుకొన్నట్లుతొయ్యలికంత-సిరమునని డెగుడజీరంబుమదను*డళిబలంబులకిడునాహారమనగ-సలలితక్రమమొప్పసనికంటిమీఁద*తరుణినిసప్తపాదములుద్రొక్కించె

హారుడుస్వకీయపూర్వాపరాధములు*పరిహారమొనరించబతిమాలుకరణి
మరునిజేగంటనామంగళసూత్ర * మంగనామణికంఠమందుంచియొసగ-
మంగళస్థితిసర్వమంగళగళము*నందుబొందుగగట్టినర్ధేందుమౌళి- బాలిక
ముత్యముల్ బట్టిదోర్మూల-కూలంకషోన్నతకుచములుపొంగ*నడుమువడం
కసుందరపుముత్తరులు-మడతలువిడివడమగనియాదలను * తలబ్రాలుబో
సెహస్తయుగంబుసాచి - కలికిపైతలబ్రాలుగదియించెధవుడు *కొమ్మలు
తోబుట్టుగులునుమాయమ్మ-లెమ్మెలేలెమ్మప్రాల్నింపునింపనుచు* నెచ్చ
రింపగనించెనీశునిమౌళి-మచ్చరింపుచునించెమగువపైమగడు*దలపించెహ
రికిశ్రీతరుణికికలశ- జలనిధిలోక్రీడజల్లుపోరాట* తల బ్రాలముత్యముల్
తారకలాయె-నలమినుసికవేల్పునౌదలయందు*ఘనవేణిశిరమునఁగరకాళి
యమ్యె-ఘనతరలీలఁదకౌతుకవేళ*మును బ్రహ్మయానందమునబొందు
టెంత-జనులుబ్రహ్మానందసంపదగనిరి.

వ॥అప్పుడు పేరటాండ్రు పాటలువాడిరటయెటువలెన॥

శ్రీమహాలక్ష్మిని శ్రీవిష్ణుబోలి। తామరతంపరై దగిలిదంపతులు॥౧॥పూ
వునతావియుబొందినయట్లు । లీవధూవరులుందు రెనసియెల్లపుడు ॥౨॥ క
లికిమాగౌరమ్మకడకంటిచూపు। కలువపూవులదండగదశంకరునకు॥౩॥ చె
న్నగపూవులచేరెత్తినట్లు।కన్నెమాగౌరమ్మకాపురంబొప్పు॥౪॥కడు వేడు
కలచేతకడుపుచల్లగను।కొడుకులకోటవైకొమరొందవమ్మ॥౫॥ వెలయంగ
దగుచోట్లవియ్యంబులంది।కలకాలమఖిలభోగములవర్ధిల్లు॥౬॥

మారువరాగం - ఆదితాళం.

శోభనమేశర్వునకు। శోభనమేపార్వతికి । శోభనమేకైలాసశుభ
మందిరునకు॥శోభాన మె॥ మణితతులహారతులు । మదవతులుమీరివరమ్మా।
మతియుతుడుశివ్వన్నమగువగౌరమ్మకు॥శోభానా మే.

పాటలగంధులునివ్వాళిపళ్లెంబులుబట్టిపాటలుబాడిరటయెటువలెన

మంగళగౌరిరాగం - అటతాళం.

మంగళముపుంగవతురంగవరసంగునకు। మంగళముమాసర్వమంగ

శకును।మంగళముతుంగరవభంగరంగదభంగ।గంగోత్తమాంగునకుగౌర
మ్మకూ॥జయమంగళంనిత్యశుభమంగళం-

గౌరీసత్కృతకేళీ।కారుణ్యపాళీ।నీరేజరిపుమౌళీ।నీకునివ్వాళీ। నివ్వా
ళిదుగోగౌరమ్మ।నీకిచ్చేముగైకొమ్మ। శివ్వన్నముద్దులగుమ్మ। చిన్నిబంగా
రుబొమ్మ॥నివ్వాళి॥తోయజాక్షునిచెంతతోరమగుశ్రీకాంత। కాయజునిత
ల్లిశృంగారవల్లీ।యాయువునుశ్రీయుజెలువారునైదువతనము। స్థాయిగా
గౌరికేదయచేసెను॥జయమంగళం.

వ॥అప్పుడుభృంగియంగనాక్రమంబున కొప్పుదిద్దికొనుచు పయ్యెద
సవరించినయట్లసవరింపుచు నందఱినవ్వించిపార్వతిసన్నిధికివచ్చి యిం
తదలంచినదానవు నాడుమాబెదరింపులకేలలొంగుదువు తాటాకుచప్పుళ్ల
కుకుందేళ్లుబెదరునెనాడెడై వగతిని మీరొక్కరైన నాపైదయయుంచవలె
నని గట్టిచేసుకొంటిగదాయట్లదయయుంచెదవో లేకచీకాకుగావించితిన
నకోపగించెదవో కోపగించినపన్నెండామడపారిపోదుసెలవిమ్మనిననగ
జనగవడంచికొనితలవంచికొనియుండ కోపంబున్నట్లయున్నదిదయనెక్క
తేపనైననుజూడవైతివి నేనికనిలువనాడుమార్గంబుబట్టెదనని లేచిపోవ
కలవాణినవమాలికలునీపైకోపంబేలవచ్చు కల్యాణకాలంబుగనక సిగ్గున
నిట్లుండెనిలునిలుమనిన వాడుబ్బినాపనిబాగాయెననిగంతులువైచుచు వే
శ్యాజనంబులవెక్కిరింపుచు వైశ్యులజడిపించుచునుండెనంతహిమవంతుం
డనంతామరానంతామరలకు చంధనతాంబూలాద్యభీష్టప్రశస్త వస్తువు
లొసంగెదదనంతరంబ.

ద్విపద.

వామదేవుండంతవామభాగమున-వామలోచనయుండవహ్నివిధ్యు
క్త*హోమంబుసేయుచునువిడదాయుచును - వామార్థజానిత్వవాంఛ
చేబలెను*చెలువొందెచెలువయుసిగ్గుననొదిగి-వెలలేనితనమూర్తివెలిజేయ
కుండ*చూచియుజూడనిచూపులచేత- పూచిపూయనిహృదంభోజంబుచేత
నంటియంటనియవయవములచేత - నొంటినెంటనిమనోజోద్వృత్తిచేత*

గూడియుగూడనికోరికచేత-వీడియువీడని వేదనచేత *జంపతుల్ వాగగూచ
రభోగరాగ-లంపటులై రంతలాజహోమంబు* నలువ జేయించెమైనాకు
డింపొంద-వెలయస్థాలీపాకవిధులుగావించి*కులదేవతనునిల్పి కోరికచేత-
నలువొందునలయరుంధతినిజూపించి*భగవదర్పణజేసిబ్రహ్మాదిసురల- కగ
ణితద్విజపాళికఖిలలోకోత్క-*రమ్ములకునునగరాజమర్పించె. కమ్మని నేతు
లుకాల్వలుగాఁగ*చాయపప్పులుమంచిశాల్యన్నములును-కాయగూరలుచా
గ్లుకలగాయపులుసు*లూరగాయలురుచులూరుపచ్చళ్లు-బూరెలుకక్క-రా
ల్ పూతట్లుగారె*లరిసెలప్పాల్ మొదలైనభక్ష్యములు - పరమాన్నము
లుపంచ్చాపానకాల్ వరుగు* లప్పడాల్వడియంబులలరుతిమ్మనము-లొప్పగు
పెరుగుపాలొప్పలకుప్ప*లపరంజిపళ్లెంబులందువడ్డింప-నపరిమితప్రీతినపు
డారగించి*యందరువీడ్యంబులందిసౌధాగ్ర - బృందంబులందునబెంపొం
దిరంచు.

## ద్విపద.

అంతకాంతలుమంగళాక్రాంతగతుల- కంతదెచ్చిరిరత్నకాంతపా
త్రముల*ప్రాకెన్నజేసిరిబ్రహ్మాదులెల్ల - ప్రాకటాశీర్వాదఫణితులుమీర
దొంగవేలిమిజేసిదొంగిలెశర్వు - డంగనామణిసరసాంతరంగంబు * ఆ
నాల్గుదినములత్యానందభరిత-మానసులైబహుమానంబులంది* భోజనా
దియథేష్టభోగంబులంది- తేజంబునొందిరిత్రిజగతీజనము* దంపతులకును
రతరుణులామోద - సంపదబెట్టిరిజాఫరానలుగు * మగనిపేర్మగువనుమ
గువపేర్మగని-తగజెప్పుమనుచునుతలుపులువేసి*పాటలుబాడుచుపరిహాసి
తంపు-మాటలతేటలమాటిమాటికిని* చెలగిరైదువనాడు శేషహోమం
బు-సలిపినాకబలికై సమకట్టిరంత.

వ॥అప్పుడుకప్పురగంధులుపెండ్లికట్నంబులపాటలుబాడిరటయెటువలెన॥

కలికిరావెచిలుకల।కొలికిరావెమరునిరా।చిలుకరావెవజ్రంపు। పలు
కరావె॥౧॥యింతిరావెగోజ్జంగి।బంతిరావెరత్నాల।దొంతిరావెమదనుని।
దంతిరావె॥౨॥కొమ్మరావెబంగారుబొమ్మరావెచిగురులే। గొమ్మరావెము

ద్దులగుమ్మరావె॥3॥కన్నెరావెకప్పురంపుదిన్నెకానరావెనీవు। వన్నెగన్న చిన్నిపొన్నగున్నరావె॥౪॥పచ్చికస్తూరిరావెపన్నీటకుప్పెరావె। పచ్చవిల్తు తేజిపండ్లపనసరావె॥౫॥చెలియరావెచేడెరావెచిన్నిరావెపొన్నిరావె। పె లదిరావెకొోట్లములువేగదంతుము॥౬॥ గరుడవాహనములుమంచి।గౌరికుం కుమములురత్న। సరులుపచ్చగన్నెరులుసన్నదినుసులు । కలయగూర్చికర ములందు।కంకణక్వణములుమొరయ। నలరుటందెలెల్లఘల్లురనగదంచిరి॥ సువ్వి సువ్వి సువ్వి సువ్వి సువ్వి సువ్వి సువ్వి సువ్వి।సువ్వి సువ్వి సువ్వన్న సువ్వి లాలలె.

ద్విపద.

అంగనావళిదీర్చినట్టిముత్యాల - రంగవల్లికచిత్రరచనచేమెఱయ* నాగప్పసానియైనయరుంధతియును-వేగతద్విధులెల్లవెలయంగదీర్చి*యా కుఁగంటముచేతనందిలిఖించి-జోకగాశశివామాళిసుదతితోనుండ*హరియిచ్చె కట్నముస్తైశ్వర్యములును-హరునకుపార్వతికతులితప్రేమ* మామయల్లు నకిచ్చెమణికిరీటాది-సామగ్రివస్తువుల్ చదివించిరప్పు * డామనిగాఁగబ్ర హ్మాదులునంత - మూరాడునీరాడుగొబ్బునదోణకి - యారూఢిపాన్పెక్కి-యాసతిపురుషు*లుయ్యేలలోబొమ్మనుంచివసంత-మొయ్యనజిలికించియు విదలవ్వేళ*జోజోకుమారజోజోచిన్నియన్న-జోజోననుంగన్నచొక్కపు తండ్రి*యనుచుపాటలుబాడిరటదంపతులకు-మునుమునుమిథునతాంబూ లంబులిచ్చి*రంతవసంతంబులాడిరందరును-కంతుగురుండుశ్రీకంతునిమీద సంతసమందికాంచననాళములను * మరదివావియొనర్చిమాధవస్వామి- హరునిమీదనుకుంకుమాంబువుల్చిమ్మె *కనకాంబరచ్ఛవికౌస్తుభప్రభలు- గనుచువసంతంబుకంజాతుమీద*జిలికితిననిసదాశివుడూరకుండె- కులశై లసుతమీదకుంకుమరసము*శ్రీమహిళనీళలుజెలరేగినించ - తామరసాతు డుదైతలడాసి*మూఁడుచేతులచేతముప్పురబట్టి-తోఁడబుట్టువటంచుతో య్యలిబిలిచి* నాలవహస్తంబునన్వసంతంబు-లీలనందిచ్చియాలేమమీద గౌరిచేనింపించికలకలనవ్వె- శారదమేనకసరసంబులాడి * రజహంసగిరు

లుసయ్యాటలదగిలె-త్రిజగతిజనమెల్లదివ్యాప్సరోమ్మ * గాతులతోఁచల్లు లాడిరాగాబ్ధి-నతుణంబుననోలలాడినట్లుండె.

వ॥అప్పుడప్సరోవరవర్ణులు కుంకుమరసచూర్ణపూర్ణలై చిత్తజుండు తత్తరిల్లకవిరహులమొత్తంబుల గ్రుమ్మినక్రొత్తవిరికత్తులంబోలి నృత్యంబులుసలిపిరటయెటువలెన్.

రాగంసారంగ - అటతాళం.

రారెచెలులారమీరందరురారెసఖులార॥ రారెచెలులార।రారెసఖు లార।సారెశర్వునితోఁవ।సంతమాడుదాము॥ రారెచెలులార॥చెన్నగుపన్నీ రుచిమ్మనగ్రోవిలోఁ।పన్నిమనచెలువుని।పైనిజిమ్ముదాము॥రారెచెలు॥౧॥ కుంకుమబుక్క-భ।గ్గుండికర్పూరము।పొంకముగాజేత।బూనిగుప్పదము॥రా రె॥౨॥ మల్లెలుజాజులుమొల్లలుగొజ్జగులు మొల్లముగామనముచల్లులాడు దాము॥రారె॥౩॥

గీ॥భూరిమొనగెభూరిభూరిమహాభూరి। సంఖ్యకెచ్చువిప్రజాలము లకు । ఘనతవిద్వదార్యకవిగాయకనటాది । కమునకిచ్చెవాంఛితముహి మాద్రి॥

ద్విపద.

అప్పుడువిడిదికినరిగిపార్వతిని - నప్పగించుటకుభిన్నాత్ముడైవరుని* చేతులోఁకూతురిచెయివేసిపలికె-నాతండ్రిపరమేశనాకునీవంటి*యల్లుడు దొరికినాడధికభాగ్యంబు-తొల్లిటినాతపస్తోమంబుపండె * పను లేమినేరదు పసిబిడ్డగోల-దినదినంబుననీవెదిద్దుకోవలెను*మీరెరుంగనిదేమిమిన్నక నే ను - గారాముచేగన్నకడుపొటనంటి * భారమెవ్వరిదనిపార్వతిఁజూచి- నాఁజనమతల్లి నాతల్లినీకు* ధవుడన్నగురుడన్నదైవమటన్న - నవధనంబ న్నవెన్నగసదాశివుడె*యతిభక్తిపతిమాటకడుగుదాటకుమి-యతివకుసత మైనదత్తిల్లెయనుచు*భూరిచింతాక్రాంతబుద్ధిగద్గదిక-వారిజాక్షునితోడ వలిమలబలికె*నారాయణస్వామినన్నలినయ్య-కారణకర్తవుగదయంద

రికిని*నీయాజ్ఞచేనయ్యెనిఖిలమోదేవ-తోయజభాండముల్ దొంతులకోల
ది*కడుపులోనుంచినఘనుడనాయన్న-పడతినీపట్టుగాభావించికరుణ*గని
పెట్టవలెననికన్నీరునించ-జనులకెల్లను నేత్రజలములుదొరగె*జాలినవ్వన
మాలిజయశాలిబలికె-యేలనీకీచింతహిమవంతయింత*యేకశరీరులై యీ
యుమాహరులు-జొకనుందురుశుభశోభితులగుచు*లోలాక్షినిచ్చియల్లుని
గొంటివనుచు-లాలనజేసెశ్రీలక్ష్మీశుడంత.

వ॥అప్పుడు మేనకాహిమవంతులు సుతన త్తింటికనుచుటకు జాలిని
ట్లనిరి.

సీ॥బొమ్మలపెండ్లిండ్లుబొట్టెలగూర్చుకునెవరుజేసేరెమాయింటనిక
ను।చిన్నారిపొన్నారిచిన్నెలసిరినోములెవరునోచేరెమాయింటనికను।ప
లుకు-చిలుకలకెల్లపద్యముల్ జెప్పుచునెవ్వరాడేరెమాయింటనికను। ప్రాణ
పదంబుగాబహుపుష్పజాతులనెవరుబ్రోచేరెమాయింటనికను। చిన్నబో
నిల్లునీవులేకున్నక్షణము।పొలతినీతోడనేప్రొద్దుబుచ్చికొందు।నింతిరోనిన్ను
న త్తవారింటికనిచి।తాళగలనటెయోసినాతల్లి కాన॥

గీ॥అమితభాగ్యుండుకలశాబ్ధియల్లుడీశ్వ।రేశ్వరుఁడుప్రేమతోతనయిం
టనుండె। పాపుడను నేనుతామసపరుఁడుహరుడు । బొట్టెగొనియుండుమె
టుగురాత్మెట్టమీద॥

వ॥అనిజాలింబడుశైలరాజుంజూచి తమ్మిచూలిమొదలగువారు జా
లినీకేలనీలకంఠుండుకృపాళుండు నీయిచ్చవచ్చినప్పుడిచ్చటికి నచ్చపుమ
చ్చిక మచ్చకంటితోవచ్చిమనసువచ్చి నన్నాళ్లుండుననియూరార్చినస
మ్మతించి కూతునకునల్లునకునపరిమిత కరితురగరథపదాతుల ననేకదా
సదాసీజనంబుల నగణితమణిగణంబుల సుదారకనకచిత్రాంబరవారం
బులనొసంగి యతిదూరంబుబనిచి గూతుంగౌఁగిలించికొని యెట్టకేలకువద
లి మఱియుతగుబుద్ధులుజెప్పివీడ్కొలిపివచ్చి బ్రహ్మేంద్రాదిదేవతలకు వ
శిష్ఠాదిమునివరులకు మఱియుఁదక్కినబంధుమిత్రులకు నపారంబులైనకా
నుకకట్నంబులిచ్చి యుచితసత్కారంబులనంపకంబుజేసి శ్రీభూనీలాసహి

తుండైన శ్రీమన్నారాయణస్వామిని షోడశోపచారంబులంబూజచేసి తనయందునింపొందు ననర్ఘ్యమరకతమాణిక్యంబులు తులశీదళాకారంబుగారచియింపించిగూర్చినమణి తులశీదామంబు చరణకంజంబులందుంచి మేనకాసహితుండై సాష్టాంగదండప్రణామంబుజేసి లేచిహస్తపుటిమస్తతటినుంచియిట్లనియె.

గీ॥వాసుదేవభక్తవరదజగన్నాథ। పరమపురుషకృష్ణహరిముకుంద।
జూఱదొరకెసకలశుభములుమీరాక। జూఱదొరకెమోదసుధయుమదికి॥

రాగంసావేరి - తాళంరూపకం.

నారాయణపురుషోత్తమనన్నేలినవాఁడ।నీరేజదళేక్షణనేననుబొఁగడగగలన।కనుగొంటిమిమీరూపముకన్నులుచల్లగను।వనధిసుతాదులతోఁడనువచ్చితిభాసిల్లగను॥మునుపటినాపుణ్యంబులుమునుకొనిసంధిల్లగను। జనులెల్లనువెఱగందుచు।సన్మతిరంజిల్లగను॥ మునిజాలావనశీలాఘనలీలాలోల।ఘననీలావనమాలాకరవత్సవిశాల।కనకవసనవననిధిశయనవినుతసనకవిశ్వజనకా।ననుఘనునిగనొనరించితి।వనఘకరుణజెనగొన॥ హరినారాయ॥

శ్లో॥నారాయణనమన్న్యాసింనలినాక్షనతామర। నారదస్తుతనఃపాహి నమస్తుభ్యంనమోనమః॥

వ॥అనివందనంబుజేసిన ముకుందుండు సానందుండైనగప్రభునకభీష్టవరంబులొసంగి వీడ్కొనివైకుంఠపురంబునకరిగి జగద్రక్షాదీక్షాదక్షాత్ముండైయుండెనంత.

రాగంకన్నడగౌళ - తాళంజంపె.

పార్వతినిబెండ్లాడిభవుఁడుశ్రీకైలాస।పట్టణంబునకువచ్చెఁ॥హెచ్చెఁ సర్వలోకములలో జనులుబ్రహ్మాదులును । సంయములువెంటరాగాబాగా॥పా॥ అమరులటపుష్పవర్షములుగురియింపగా।నచ్చరలువేడ్కనాడాబాడా॥పార్వ॥౧॥తుములముగదేవదుందుభులుమర్దలపటహ । తూర్యకాహళులుమొఱయా।మెఱయా॥పార్వతి॥౨॥ ప్రమథగణములునుభయపా

ర్శ్వములదగిబరాబరులు సేయుచునుమీరా। కేరా॥పార్వ॥౩॥ రమణులురు
సౌధజాలములముక్తాతతులు।సుమతతులశాసలెల్లా।జల్లా॥పార్వ॥౪॥ రమ
ణీయమణులనీరాజనంబులుబట్టి।రమణులందందమొప్పా। త్రిప్పా॥పార్వ
౫॥కమనీయవిప్రసంఘుస్వస్తిభామినీ।కల్యాణరవముజెలగా।వెలగా॥ పా
ర్వతినిబెండ్లాడి।భవుడుశ్రీకైలాసపట్టణంబునకువచ్చెఁ హెచ్చెఁ॥౬॥

రగడ.

అంతటసతితోఁ। నలరుచునభవుడు। నంతిపురిందగె నద్భుతవిభవుడు
బ్రహ్మాదులనంపకములొనర్చెను। బ్రహ్మానందప్రాప్తిదనర్చెను। వేడుక
తోఁశుభవిధులటునెఱపెను।పోడిమితోఁడుతప్రొద్దులుజఱపెను। ఝొక్కని
శఁసుముహూర్తమువెలయఁగ।చక్కనిసౌధస్థలిబెంపొలయఁగ। నిలువుటద్ద
ములునెఱచిత్రంబులు। నలరెడుగోడలు।నతిచిత్రంబులు। నగరుధూపకము
లగుజాలకములు। నగణితమృదుశయ్యాజాలకములు। తోరపువగజెందువి
తానంబులు।సౌరభయుతపుష్పవితానంబులు।కుటిచీపీటలు।కురువేరులనగు
సుఅటీల్ సొగసున।సురనారులనగు।చక్కనిబొమ్మలుచతురంగంబులు।చొ
క్కపుసొగటాల్।శుభరంగంబులు।పలుకుచిలుకలును।పారావతములు। చ
లకలవింకలుశారీశతములు। దలమగుమద్దెలతంబురవీణలు। కలపముకప్ర
ము।కస్తురివీణలు।పన్నీరత్తరుబహువీటికలును। సన్నుతమణిభూషాపేటిక
లును।చమరుతివాచీల్ సరసపాత్రములు। మొదలగువస్తులుమోహపాత్ర
ములు। దగునాహర్మ్యాంతరకుట్టిమమున। పగడపుపందిరిపట్టెమంచమున।
శర్వుడుండె మృదుశయ్యాంతరమున। పార్వతిగలయఁగ। బహుళాంతర
మున.

ద్విపద.

నగజాతయునుజెలుల్ నానావిధంబు-లగునలంకరణంబులాచరించు
టయు*పేరజాండ్రనుబిలుపించుటరత్న- తోరణంబులుసుమస్తోమమాల్య
ములు*గట్టుటసుముహూర్తఘటికలెన్నుటయు-దిట్టచేడెలతోఁడదివిరియే
కాంత*ములుబల్కినవ్వుటమొదలగునట్టి-బలువైనసందడిబరికించినాడు*

చెలువునిగూర్తురుసిద్ధంబటంచు-నలవిజెందనిలజ్జనంది వేరొక్క*మలపున నే
కాంతమణిగృహాంతమున- లలితాభ్రమునతటిల్లతయున్నయట్లు* బొలు
పైన తెరలోనబొమ్మయున్నట్లు-కలహంసకాసారకలిత మైనట్లు*చిలుకపం
జరములో జెలువొందినట్లు-దలవంచికొనియున్నతరలాక్షిజూచి*కలవాణి
నవమాలికయు మొదలైన-చెలికత్తెలయ్యింతి జేరియిట్లనిరి.

శంకరాభరణము - అటతాళం.

ఏమమ్మయోకొమ్మయిదినీకుదగునమ్మ। రావమ్మపనియున్నది (అనుపల్లవి)
మానీదకోపముమరియేమిదలచితో।యీమందిరముజొచ్చియిటురాకయు
న్నావు॥యేమమ్మయో॥ పిలిచిన నొకసారిపలుకవయ్యయోయిపుడె। కలికి
యెంతగర్వమె। నెలతరోనీమగడు।నీవు నొక్కటైతె। తలపవు లేమంచి।దాన
వునీగుణము।దెలసేను లేవే। అదుగో యెగిరె। చిలుకాలురావె। మేపుదాము।
ఫలములుదేవే। యేమోపంపె। కులశైలపతియందుకొ వెవోసిమాయమ్మ॥
యేమమ్మాయోకొమ్మయిదినీకుదగునమ్మ.

వ॥అని నెపంబులువెట్టి బహుప్రయత్నంబున బాలికామణి కేళికా
మందిరంబునకుందార్చిన ధారునబాలేందుధారింజూచి కంకణకాంచికా
కటకఘంటికాఘణంఘణలు దిక్కులునిండగ్రుక్కనగిరుక్కనమరలినకల
వాణినవమాలికలుగదిమి మేలుమేలుబుద్ధిమంతురాలవనియుంటిమి నీకే
కానిలజ్జజగతిలో వారికెవ్వారికున్నది యిట్టివారెరేబగలుమగనినొడలగ
ట్టికొనితిరుగువారని యభయంబులుజూపిదోడ్కొని మహాదేవునిసన్నిధా
నంబునకరిగి పుణ్యాంగనాజనంబులకు ననేకఫలతాంబూలదానంబులిప్పిం
చి మంత్రాక్షతదీవనలిప్పించి బాలగోలనీవుసర్వజ్ఞుండవు యేలీలమెలపు
కొనెదోనీకెతెలుసు మేముతలుచుదెలుపనేల మీరుమీరొక్కటె మేమే
వేరని చెలులకందరకన్నిపనులుగల్పించిపంపించి తానునువారెవ్వారును
రారైరనితలుపుదారసిలకీలుబిగించిజనినంత.

క॥తలవంచిబాలబొటవ్రే।లిలవ్రాయుచునిలచెనింక।నించువిలుతుతూ
పులు నేలబెట్టికాలం। జలమున రాతుననిసన్నసలిపెడిభంగిన్॥

వ॥అంతనక్కాంతంగనియక్కాంతుడిట్లనియె.

రాగంముఖారి - ఆదితాళం.

ఏలరావెయికనైననన్నేలరావె॥యేలరావేయోబాలసిగ్గులికచాలునే నుసీ। మేలువాడనే। యేలరావె॥విరహాశరధిపరి। పరివిధముల వే।సరియీాదు చునీ।వరకుతుదిగనక।తరుణిరోనేసీ।శరణమునొందితి।కరమొసంగిననుదరిని జేర్చవె॥యేలరావె॥౧॥మరుడుచెఱుకువిలు।కరమునగొనివిరి।శరములుబర పెను।చురుకుచురుకుమని।యురమటదూసెను।పరవశమయ్యెను।కరుణనీయ ధర।వరసుధనీవే॥యేల॥౨॥కలికిమనలతప।ములుఫలియించెను।తలిమముపై నను।గలసిమెలగకిటు।వలెతలవంచుకు।నిలుతురటవెచెలి। కులుకుచుబలుకు చుకోర్కెదీర్చవె॥యేలరా॥3॥

ద్విపద.

అనుచుమోహంబుననధిపుడుహస్త- వనజంబుబట్టిబల్వగబెట్టువింటి* నారియాకర్షించునలినాస్త్రుడనగ-నారియాకర్షించినవశయ్యనుంచ* మెఱుగుబోడిసిరంబుమిక్కిలివంచి. కఱగినయట్టిబంగరుముద్దలాగు * ఘనలజ్జచేనున్నకాంతుడిట్లనియె-వనితయిందన్యులెవ్వారలున్నారు * ననువింతసేయుటనాయమనీకు-వనజాయతాక్షినీవాడనుగానె * మనసిచ్చినాతో డమాటాడవేల- కొంకనేటికిమనకోర్కులుపండె - నింకసిగ్గుబడయెహేతువులేదు* కోమలినామీదకోపమాలేక-యామాటదెల్పునాయపరాధమేమి*నాడునీవనములోనతపంబుజేసి-కూడకేగినదియెక్కువనేరమయ్యె నాతప్పుసైరింపునుంజలిజేతు- నీతెఱంగునవేడనెదదయరాదె* యనిచుబుకముబట్టియాననంబెత్తి-కొనగోళ్లచేతముంగురులెగదువ్వి*తిలకమించుకజాఱెదిద్దుమనటవె-కొలుకులువదలిచిక్కులుబడనేమి * యలివేణిమాక్తికహారములెల్ల-నలకప్పురపువిడెంబందియ్యగదవె * పలుకకున్ననుమానెపడతినీవనుచు* నెపములువన్నికన్నియతనువంటి-యపరిమితానందుడైయుండెమఱియు-

సీ॥ మోవియానగబోవ మోము ద్రిప్పినయింతినిద్దంపు జెక్కులు ముద్దు గొనును। చెలి జేరి యొకమాట జెప్పబో చెలితద్గనయ నాంబురుహచుంబనం బొనర్చు। నీవియానగబోవ నెలత కేల్గవగప్ప చనుదోయి పైనఖక్షతము సేయు। పొక్కిలి నొక్కగాబోవ నోసరిలచక్కెరబొమ్మ పక్కగిల్గింత గోలుపు। ధవుడు నేర్పనప్రియయవయవములందు। నొకటిగాకున్న మఱియు వేరొకటి జెంది। సతినిన గెనిదిమన్మథాచార్యముద్ర। భుజముదప్పినవీపుదవ్వ నెయటంచు॥

గీ॥ అతివతోఁడుత సరసంబులాడియాడి। చెలియమర్మస్థలంబులు జెనకిచెనకి। కాంతబతిమాలిబతిమాలి కొంతకొంత। సిగ్గువదలించె బాలేందుశేఖరుండు॥

ఉ॥ పాటలగంధికిం గురుపాటునకంచుకసంధులూడన। య్యాటల నీవిలాగ పతియప్పుడ పందిరిపట్టె మంచపుం। గాటపుజూలు మేల్వాలు వగప్పెనుబాలిక దాననేమగుం। దేటగగాంచె కాంచిమణిదీపములం రమణుండు సర్వముం॥

గీ॥ శాత్రవునకై ననుపకృతిసల్పు కతన। చిత్తజాతుఁడె కదయుత్తమోత్తముండు। సాంద్రలజ్జావరణమురుశక్తిబాపి। పడతిచిత్తధనంబీశుపాలు జేసె

ద్విపద.

బాలిక ప్రియతనుస్పర్శసౌఖ్యాబ్ధి - హేలలాడుచు నేమియెరుగకయుండె* నారమణుఁడు మన్మథారామమెల్ల - జూరగొన్నట్టులు చొక్కపుతావి* మోవి తేనియలాని ముద్దులే కేలు- తీవల బెనగొని వృథతరోరోజ * ఫలములు గైకొని భాసురావయవ- లలితలతాంతములన్ముదమంది* తనవిదీరకకనుదమ్ములునొసలు- ఘనకపోలములు చక్కగనొక్కపారె* బలువేడ్కచుంబించె పంచాననముల- పలుమోములర్థించెపటు మోహమాన* సంబున నేకదాసకలాంగకలిత - చుంబనసిద్ధికై సొబగుడుమఱియు * మానినితోనవాఙ్మానసగోచ- రానంద మొందియొయ్యనయనివార్య* కేళులఁ జెలిఁ గౌగిం

తాఁగఁబిగి - లీలమేల్కబడనికల్బెనగొన్నలాగు * తనువులొక్కటిగాఁగఁదం పతుల్ పాను-పుననిదురించిరిపూర్వకాలీన * విరహజాగరణంపువెతలెల్ల దీర - మురువుగానేకీలుమనువన్నినారొ * పసిడిబొమ్మలురెండుపాదంబు లొత్తె-విసరెపూసురుటిచేవేరొక్క-బొమ్మ*

వ॥అంతనిశాంతంబునమేల్కని.

సీ॥జన్నిదంబులుముత్తెసరులుజిక్కులువడ్డమెలులువిప్పుచుకొంత మే లమాడి । తారుమారైనవస్త్రములుపూర్వాదానవైఖరికొకకొంతవంతు లాడి । నవపునారతయాచనానిరోధములచే ననువుగానొకకొంతబెనగు లాడి । మునుపటివటువేషమునకతల్ తలపోసి ముచ్చటగాకొంతముచ్చ టాడి। నగవుబలుకులకులుకులమిగుల ప్రేమ । జిలుగుజూపులకెూపులకళల నెలవు। వెలయబెణకులచెణకులవేడ్కలలర।బాహ్యకేళియొనర్చిరప్పతియు సతియు॥

వ॥అంతవైతాళియిట్లనియె.

దేవగాంధారిరాగం - జంపెతాళం.

లేవమ్మగౌరీదేవీ। లేవమ్మశ్రీగౌరి। దేవియింకెందాక। నీవిభుకౌఁగిటను నిదురించేవమ్మ॥ లేవమ్మగౌరీదేవి॥కమలములువికసించి।భ్రమరపంజ్తులచేత కమనీయగతినలరె। కాంతయిపుడు । రమణీయమైననేత్రములురెప్పలుద్రి ప్పి। యమితమృష్టిలోకమలరించవమ్మ॥ లేవ॥౧॥ చిలుకలునుకోకిలలు। చెల గికిలకిలమనుచు।పలుదెరంగులచేత।బలుకుచునుండెఁ। పలుకుపలుకుకుతేనె లొలుకుపలుకులచేత। చెలువనీపెనిమిటిని సెలవడుగవమ్మ॥ లేవ॥౨॥ ఉదయ శైలముమీద।కుదురుగారవిబింబ। ముదయించియరుణరుచిబొందలెనిదుగో। పుదతినీచనుదోయిసొంపునింపెడుకెంపు। పదకంబుసవరించిపడతిరావమ్మ॥ లేవమ్మగౌరిదేవి॥3॥

అనంతరంబ.

సీ॥వాఁడినతీఁగెకైవడినున్నమేనితో కెంపుకన్నులనిద్రముంపుతోడ

పలుమొననాటులేర్పడిన కెమ్మోవితో చిలుచెమటంటుముంగురులతోడ। చెదరుకాటుకనీటు చెక్కుటద్దములతో నపరిమితంపుటూరుపులతోడ। చెలువంపుచనుదోయి నెలవంకగుంపుతో తారుమారుగగట్టుచీరతోడ । సడలుక్రొమ్ముడి కేలనింపడరదిద్ది। బడలికల చేతనడుగులు తడబడంగ। గడుముదంబున వెతలజ్జగడలుకొనగ। వెడలె చెలికళవిలసిల్లుపడకటిల్లు॥

ద్విపద

ఘనతర ప్రేమగల్గగ సదాశివుడు-దినదిన క్రమమునదిద్దినప్రోఢ * ప్రౌఢగావించి సౌభాగ్యనిరూఢ-గాఢయధేష్టభోగంబులజెంది* కైలాససుందరకందరస్థలుల- కేళీవనీనారి కేళీవనముల* కొలకుల కెలకులకుంజపుంజముల మెలగుచు నెలగుచుమితిలేని వేడ్క*క్రీడావినోదభంగినటించి యొక్క-నాడులీలార్థమైనవ్వుటాలకును*పార్వతి కోపంబుబరికించదలచి- శర్వుండు కేళికాసౌధంబులోన* కాంతాకృతివహించిగంగతరంగ - కాంతియుగంగమైకడు జెలగంగ * సరసత క్రీడించుసమయంబునందు - ధరసుత చెలికత్తెధారునజూచి* కొఱకొఱలాడుచు కోపంబుతోడ- బలువిడిచనుదోయిబరువుననడుము*గడగడవడకంగ కచభృంగపాళి - ముడివిడియడుగుదమ్ముల మీదగవయ* వెక్కసంబగునూర్పువిడివడకడర - చెక్కిళ్ల గ్రమ్మినచెమ్మటతోడ*బిఱబిఱజను దెంచి బెగడియాగౌరి - దరిజేరియప్పుడ త్తరుణియిట్లని

క॥ఓయమ్మయేమి జెప్పుదు।నీయధిపుడు కోచగాడె నిశ్శంకుండై। కాయజకేళీపరతం। బాయకయున్నాడె యొక్కభామినితోడన్॥

మ॥అనినంగోమలిగుండెఝల్లుమనిహస్తాబ్జంబునందున్న క్రొ । న్ననగుత్తింబడవైచి పల్కుచిలుకన్రాయంచనుంద్రోచియే । వనజాతేక్షణతోడగూడె పతియో వామాక్షియిం కేలనీ । వనుమానంబులుమాని దెల్పగదవే। యాద్యంతతద్వైఖరుల్॥

వ॥అనినన చ్చెలికత్తెయ దెభృంగివచ్చుచున్నాడు వానినంతయుం దెలుసుకొందమని రావించి తద్వృత్తాంతంబంతయు నడిగినభృంగియిట్లనియె

యమ్మా నాకేలనే నేమిజెప్పినవేళాకోళంబై తోచుపరిహాసకుని తేలు బొడచినట్లన్నసామితమీ రెఱింగినదేయనిన నబ్బోటిమాటిమాటికిమఱియు నడిగిన నతంమకలహంబు పెంచదలంచియిట్లనియె నీయమ్మమాకుకన్నతల్లివంటిదిగావుననున్నట్లు దెలుపవలసె వినుము నేటనుండికాదు బహుదినములనాటనుండి యేటిరూపంబున నొక్కబోటిని శిరంబున నెక్కించికొని యుంచికొనియె అదిశైవాలకువలయాళి శంఖమృణాళకోకతరంగావర్త పులినమకరకమఠకమలంబులుగావు కచనయనాపాంగకంఠ కరకుచవళినాభినితంబ జంఘప్రపదపదంబులు ఈమర్మంబుమీమదినుంచుట యే ధర్మంబుగానిబయలుపడిన మాకుండరాములువచ్చు రానులైననేమిసకల గుణాభిరాములుమీ రెఱుంగని దేమియనిన నబ్బోటియుమఱియునడుగుచుండిన.

చ॥ అనవినియట్టియేమడిగెదంచుచిరాకునలేచిపార్వతీ। వనితనితంబ లంబికచవారముచేముడిగొల్పియల్కచే। ఘనమణిభూషలూడ్చినిడుకస్తురిపట్టియబెట్టికోపగే। హానియతభౌమశయ్యదనరారెనిరంతరకంతువేదన౯

గీ॥ పొఱలునుసురనుకనుమూయువెఱగుజెందు। జెదరుపాన్పునబడులేచునెదగునవ్వు। కన్నుగవనీరునించుచికాకునొందు। వాయుచలవల్లిపోలికవడకుజెందు॥

వ॥ ఇట్లుదురంతవేదనం బొందిసోలితెప్పిరిలి యయ్యొప్పులకుప్పచిగురుటాకునవిసరుకలవాణింజూచియిట్లనియె.

ద్విపద.

అలివేణివినవమ్మయహాహాయీవింత- కలలోనెఱుంగముగదవెయో యమ్మ* నెఱపైటవేయగనేరనినాడె-కుఱులుకొప్పునకొనగూడనినాడె* ధవుడన్నగురుడన్నదైవమటన్న-నవధనంబన్ననెన్నగతానెయనుచు * గట్టిగాబహుతపఃక్లాంతాత్మనగుచు-చెట్టబట్టితినింతజేసుటనెఱుగ*గడెమైన నెడబాయగా లేనివాడు-కడుదుర్ఘటంబైనకల్కి—నామాట * కడుగుదాటని

వాఁడుహోమహోదేవు-డెడబాసిరాఁడునేనెట్లోర్తునేఁడు* కలవాణియెక్క-డిగయ్యాళిగంగ - గలిగెనేనునునీళ్లకన్నునుమిగుల * పలచగాజూచెను ప్రాణనాథుండు- తలచెడిదెక్క-డితలయేరువచ్చె * నేటికినామీదనెలత నాతోటి-యాటలుపాటలునద్భుతచర్య*లన్నియుమఱపించెనామాయలాడి-యెన్నితెన్నులబడెనీకాపురంబు * కులగోత్రజన్మానుకూల్యాత్మనన్ను-చులకగాజేసియచ్చోఫ్రూతలేని* యెలనాగనెటునెత్తినెక్కించుకొనెను-పలుబల్కు లేలనాభాగ్యమిట్లుండె* నేమిసేయుదువిధినేమందునమ్మ - యామందులాడిపాలయ్యెనాభర్త* యక్కయీశుడులేనినైశ్వర్యమేల - చక్కదనంబేలజవ్వనంబేల*కటకటాయనిసోలికన్నులవెంట- పొటపొటనీళ్లారపోలతియిట్లనియె.

ఉ॥ కాంతుడురాడుమన్మథుడుకత్తికిరాతికిదప్పవాఁడుబల్ । పంతము జూపినాఁడుచెలిప్రాణముదక్కగనీఁడునేఁడుక । ల్పాంతసహస్రకల్పకములయ్యెనిమేషములకటకటా । యెంతనియోర్తునేమగుదునెచ్చటికేగుదునేమిసేయుదున్॥

రాగంహోయిరీ - అటతాళం.

తాళలేనేవోయమ్మా॥ వాఁడేలరాఁడేవోకొమ్మ। బాలవానిదోడితెమ్మా నాపాలగల్గివేగరమ్మ ॥తా॥౧॥ సొమ్ములేలపుచ్చుకోరె-నా - యమ్మొకానిదోడితేరె। యమ్మలారవేగరారె। వానినమ్మరాదుమీరుబోరె॥ తాళ॥౨॥ దానివలలజిక్కినాఁడె। నీ।యానయింకవాఁడురాడె। మానినియదిమాయలాడె। నాప్రాణేశుడగపడడేడే॥ తాళలేనే॥

వ॥ అనికాంతనిరంతరదురంతకంతుశరదంతురితచింతాక్రాంతయగుచున్నంగని కలవాణికన్నీరునించుచునిట్లనియె.

ద్విపద.

ఇంతిరోసీకేలనింతదురంత-చింతలునావంటిచెలికత్తెగలుగ*శతపత్రనేత్రనీసన్నిధిజేరి-పటిబటిమాలింతుపంతంబుమీర* శ్రీరమావాణీశచీరతిము

ఖ్య-నారీమణులకెల్ల నాథులగూర్ప*చెలిమికత్తెలెకా రెచిన్ని నాతల్లి-సెలవీయుమిపుడునీచిత్తమువచ్చు*నని వేగనీశునియంతికమునకు- జని మ్రొక్కి-శర్వుండుసన్న చేబిలిచి*మంతనంబునమరిమరివార్తలడుగ- వింతభావము దోఁచవెలదుకనవ్వి*కాంతకు నే జెలికత్తెనై యుండి- యంతరంగపుమాట లర్థిమా దెలుప*నావినిగంగాంగ నావిని వేశ- మావినీలకచయేమైనవిన్నదియొ*యనిహరుడడుగనోయయ్యనింకేల- ననుచుమాగౌరియునన్నియువినియె*చేరికననుదయ సేయుదుగాని- గౌరిజూడకయుండగావచ్చినాను*శివయింకదాపేలచెప్పెదవినుము-ధవళాక్షిమదివేరెతలపుచేసినది*నగజాతతోడ నేనమ్మికల్ జేసి-తెగదెంపులుగనుండితిమి మేముదేవ* చింత నేనెందుకై సేయనా వెనుక-వంతచేమనకలవాణియునైన* దెలుపదాయెననినిందింతువటంచు-బలికితి నేకాంతభావంబు చేత* ననినచిత్తముఝల్లుమనతల్లడిల్లి-కననిదినాటిదాక్షాయణిగాదె * మన సెరుంగుదుననిమక్కు-వహరుఁడు-చనెపార్వతీకోపసదనంబుదరికి.

క॥ వినయమునవచ్చుపతిగను। గొనిశాలువముసుగు వెట్టికోమలియుండ న్మనుసిక దేవరయిట్లని। యెనుమదనవిఘూర్ణమానహృదయాబ్జుండై.

ఉ॥ ఏటికిపల్క-వేధరణి నేలవసించెదుకోపమేటికే। పాటలగంధియీ కఠినభావమునాపయి నెట్లుగల్గెనే। నేటికికొమ్మనావలన నేరముదెల్ప వెముద్దుగుమ్మయే। నాటికియింత సేయదగునాతగునాసుగుణాము నోరమా॥

సీ॥ అరచందురుడుసమమైపోవుననుచునో తిలకంబు నుదుటిపైదిద్దవైతి। ననిచినతీఁగెదా నెనవచ్చునంచునో బూనవుమైమణిభూషణములు। యధరారుణిమతక్కు-వైయుండుననుచునో చెలుప్పగావిడియమ్ము సేయవైతి వలరుదమ్ములునాటిరైయెదగుననుచునో కన్నులుదెఱచినగ్గాంచవైతి। కోప మేటికినామీదకువలయాక్షి। కరుణజూడవెయిఁకనైనకమలనయన। చలమి దేటికినాయందుదలిరుబోణి। యెంతపగవాఁడనైతనేదంతిగమన॥

మ॥ చలమేలేచెలిమేలెచెంగలువనేజాపాదుశౌతమ్మిముల్క-లదా

లించెడుచూపు వెన్నెలలతళ్కుల్ నాపయింజల్లవే। కులుకుంగుబ్బలగౌఁగిలించికొనవే కూర్కొల్దగందిర్పవే। యలివేణీజలజాతపాణిరమణీ హాకీరవాణీమణీ॥

వ॥ అనినన బ్బోటికికినుకమనమున బెనగొననిదురించు బాలాహితరుణిమేలుకొలిపినట్టునిట్టూర్పునిగుడించి విరహావిదళనారుణితమదనశస్త్రంబుకోపుజూపుచూపునంచులంచులంజూచియిట్లనియె.

ద్విపద.

ఓరయెంతటివాఁడవహహానీవెన్న - నేరిచితివిమేలునీవెరాపల్కి* బొంకనేరవుచాలుపొమ్మిట్టిమాయ - లింకజాలించుమేమెఱుగుదుమింత* గంగాధరుండవుకాయజమర్మ-కర్మమేమెఱుగుదుకటకటాశైల* ధర్మమునీయందెదగునుగిరీశ*పొందుగానాయింతిపొందుజాలించి-యిందేలవచ్చితివిదివృథకార్య *మీమాయలీవగలీతక్కులెల్ల - నాముందరనుసాగునాకుటిలాత్మ*పైనమృతస్వరూపంబుగన్పించు- లోనవిషంబుండెలోకమెఱుంగ* నినునమ్మియుండిననేటుజేసితివి-కననయ్యెనీభావగరిమంబునేఁడు*కైలాససుందరకందరస్థలుల-కేళీవినోదభంగినటించుమింక* నీనేస్తకత్తెతోనీవునిశ్చింత-నేనిదేతక్షణములోనిన్నెమెప్పింతు *నగుబాటుగాకుండననుజూడుమనుచు-తెగువజేసెడుమదిదిగ్గునలేవ*పరమేశ్వరుఁడుమదిభయమందియుకను-వెరవేమిలేదనివెలదికిమ్రొక్కె.

గీ॥ హీరమంజీరసితకాంతులెల్లదిశల। నలరనెలదాల్పుశిరమంతతో లగద్రోచె। వామపాదంబుచేగౌరికాముతలను। కోర్కెదగపాలవానలుగురిసెననగ॥

ఉ॥ అప్పుడుచంద్రమౌళివినయంబుననిట్లనునల్కమానవే। యొప్పులకుప్పనీదయకుయోగ్యుడగానటెయింకనైననా। తప్పుతుమింపునీచరణతామరసంబునకాముగాయపుం। నెప్పలుదీరెభాగ్యములునాల్గోనెచిల్కలకొల్కిమాకికన్॥

క॥కలకంఠకలనవీణా।కలకలకలఫణితివిభునికట్టెదుర నెయా।కలవాణివగచెనశ్రుతులు।కొలుకులు।దిగజారిగబ్బిగుబ్బలజిందన్॥

వ॥అంతపురాంతకుండు కన్నియంగౌఁగిలించుకొని కన్నీరుదుడిచి బాలాయీలీలనీకుంజాలిబడ నేల నీవేలాగు జెప్పిన నాలాగువిందుననియూరార్చి యంతఃకలంకంబుబాపి యథేష్టభోగంబులసుఖంబుండిరి కొంత దడవునకు శివుసన్నిధికటుగుదెంచుగంగంగని పార్వతికోపంబు బట్టలేక యిట్లనియె.

రాగంశంకరాభరణం - అటతాళం.

ఎక్కడవచ్చితి వేనాకాఁపురమున।కిటునీళ్లువోయగను। అక్క। చక్కనాయెలేదు।సారస్య మేనీయక్కారమా కేటికె॥౧॥అక్కఅలేదనిపొక్కితిటి గేవునీ। వైతెబాటబట్టవె।అక్క। పెక్కుమాటలుమాను బాటబట్టనునీపెట్టు పోతలదానవా॥౨॥అదెమెనిన్నవచ్చిముఱ సేవునీకింత। యతిశయమెక్కడిదే।అక్క।వదరాకుచెండివైనీయతిశయమేమి।పల్కినపల్కరటె॥౩॥ముద్దరాలవుగనక మొగనినెత్తికెక్కిముఱియుచునున్నావె। అక్క। ముద్దులేని చంకకెక్కదలచి నేమ్రొక్కించుకుంటినటె ॥౪॥ కులగోత్రజన్మానుకూల్యభాగ్యముగల్గియలరినదానవటె।అక్క। కులజన్మములుశివుడుకోరియెరుగుసునీవు। కొండదానవుగావటె ॥౫॥ జాలారిదానయెక్కువలాడితె నేను సైసబోనుసుమ్మీ।అక్కవాలాయముగనునీవాడినపడియుండు। వా రెవరు దెల్పగదె॥౬॥అలవాటయ్యానినేనీళ్లకన్నాను।పలచనైతినటవె-అక్క- పలచనవౌదువుపరికింపలోకులకు।భయంకారివగుశ వె॥౭॥ గంగానన్నువు నీవుగావటెదరిలేనికడిమినితిరిగెదవు-అక్క- గంగనౌదుగానినీలాగుదంష్ట్రిని।గాదనిపుట్టితినా॥౮॥నీకొద్దిబలికేవునీకేలనాజోలి।నిలువునీరుగాను - అక్క-చేకొనినీముద్దుకొండరాళ్లపాటుగాకపోవునటవె॥౯॥ నాతోజగడాలాడనాతిరోయిటుకంకణములెగట్టినావటె-అక్క- నీతోవాదించ నేనెంతదానను।నీతోకలసియుందునె॥౧౦॥

రాగం రేగుప్తి - ఆదితాళం.

ఉవిదరోమనమిద్దరము యొక్క - శైతిమె - వేడ్క - శివునితో కేళిసలుపుచు చెలగుచుందామె॥ నలినశృంగారములనాఁడు నాటికి। యెంతో వివిధభోగభాగ్యములవృద్ధిగంటిమీ॥ ఉవిద.

ద్విపద.

బాలేందుధారియుపార్వతిగూడి- చాలమోదంబునసౌఖ్యంబు జెంద
నెనరనంతటకుమారోదయమయ్యె-ఘనతారకాఖ్యరాక్షసవధయయ్యె*
సకలలోకమ్ములుసంతోషమందె-ప్రకటకల్యాణపారంపర్యముగను* విజ
యనగరిని శ్రీవేంకటేశ్వరుల-రుజుగతిగూడిసమృద్ధభాగ్యముల* మృత్యుం
జయుండన మెఱసిభక్తాళి - కత్యంతఫలదాతయై జెలువొందె* శ్రీరమాప
తిపేర శ్రీహరిపేర-నారాయణుని పేర నాస్వామి పేర * నత్యంతభక్తితో
నంకితంబైన-మృత్యుంజయవిలాసమ్మదులనాటకము* హరికంకితంబౌట
హరకథయగుట-హరిహరదాసహృద్యంబగుచుండు* సతసతన్నిక్కథచది
వినవిన్న-నరులకునిహపరానందంబుదొరుకు* వరపుత్రపౌత్రాదివైభవం
బలరు-ధరణినాచంద్రార్కతారముగాగ.

ద్విపద.

శ్రీసింహభూధర శ్రీరామతీర్థ-భాసురస్థలముఖ్యబహుదేశములకు*
నాచార్యులుభయవేదాంతరహస్య-ధీచతురాత్ములుతిరుమలవంశ * కల
శాంబు[illegible]ప్రమూర్తి-సలలితుల్ పెద్దింటిసంపత్కుమార* శ్రీ
వెంకటార్యదేశికులశిష్యుడను-పావనగౌరమాంబాబుచ్చిమంత్రి* వరపు
త్రుడనుసూరవరుని[illegible]త్రుడను-యిరవొందకాశీరామేశ్వరముఖ్య * సర
సదివ్యక్షేత్రసంచారభవ్య-కరులైన వెంకన్నకామన్నయనెడు * ననుజ
న్ములనుగూడియలరినవాఁడ-శ్రీకూర్మదాసాఖ్యజెందినవాఁడ* నాకుదోఁ
చినయట్లనవ్యకావ్యంబు - రచియించిహరికినర్పణజేసినాఁడ * ప్రచుర
పాండిత్యసంభావితులార-గురుతరసత్కార్యకోవిదులార * సరసతసుగు
ణలేశంబిందునెంచి-కరుణచేనానందకరులుగావలయు.